# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**


సంపుటి 13 డిసెంబర్ 2001 సంచిక 12

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయ సూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **"మబ్బు - మధుర భావన"**

చిత్రకారుడు: **వడ్డాది పాపయ్య**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Nouns for breakfast. Enjoy yourselves.

1) duress - (a) model (b) pressure (c) fool (d) manure
2) effervescent - (a) ban (b) development (c) floss (d) fizzy
3) gab - (a) shoot (b) fulfilment (c) gust (d) chit-chat
4) gewgaw - (a) sound (b) ghost (c) home (d) trinket
5) misanthrope - (a) mixture (b) misfit (c) man-hater (d) task
6) occult - (a) witchcraft (b) the known (c) sacrifice (d) business
7) perfidy - (a) interval (b) panorama (c) treachery (d) line
8) stake - (a) position (b) hair-do (c) bet (d) peak
9) swath - (a) opening (b) path (c) horde (d) rod
10) wedge - (a) separator (b) cobweb (c) madman (d) alcohol

## Answers

1) b; coercion; as in, "The boys study only under duress"
2) d; bubbling; as in "I prefer effervescent mineral water to still"
3) d; chatter; as in, "He said nothing important - just a lot of gab"
4) d; bauble; as in, "She has a huge collection of worthless gewgaws"
5) c; mankind-hater; as in "The longer he lived and the more he learned of his fellowmen, the more of a misanthrope he became"
6) a; (usually the occult) black magic; the black arts; as in, "He has studied the occult for many years"
7) c; deceit; as in "The name of Mir Jafar is a byword for perfidy"
8) c; wager; as in, "If you want to make the game interesting, you must raise the stakes"
9) b; belt; as in, "The birds settled along the swath cut by the harvester"
10) a; division; as in, "She tried to drive a wedge between me and my husband"

# అందం, తెలుగుదనం వ.పా. చిత్రాలకే సొంతం

\- కళాసాగర్

కళ అనంతమైనది, విశ్వజనీనమైనది. భారతీయ సంస్కృతికి లలిత కళలు అనాదిగా పునాది రాళ్ళు వంటివి. ఆంధ్రప్రదేశ్‌లో అన్ని కళలతో పాటుగా చిత్ర - శిల్ప కళలు కూడా తర తరాలుగా విలసిల్లాయి. ఆంధ్ర చిత్రకళకి భారతదేశంలోనే గాక ప్రపంచం నలుమూలలా ప్రత్యేక ఆదరణ ఉన్నది. లేపాక్షి వర్ణ చిత్రాలు విశ్వవిఖ్యాతి పొందినవి. అలాగే నాగార్జునకొండ, అమరావతి శిల్పాలు అజరామరాలుగా విలసిల్లుతున్నవే!

సమకాలీనాంధ్ర చిత్రకళ కూడా గతంలో మనకున్న వైభవాన్ని దిగజారకుండా అనేక మంది చిత్రకారులు కళామతల్లికి అంతర్జాతీయంగా నీరాజనాలు పట్టించగలిగారు. ఆంధ్ర చిత్రకళా పునర్జీవనంలో దామెర్ల రామారావు, అడవిబాపిరాజు, వరదా వెంకటరత్నం, అంట్యాకుల పైడిరాజు లాంటి ఉద్దండులు ఎందరో తమ వంతు పాత్రను నిర్వహించారు. అదే కోవకు చెందిన వడ్డాది పాపయ్యగారి బొమ్మలు చూడనివారుండరంటే అతిశయోక్తి కాదు. నిన్న, మొన్నటి వరకు కూడా వివిధ పత్రికలలో ఆయన బొమ్మలు చూసి ఆనందించిన పాఠక లోకానికి ఆ 'కళాతపస్వి'ని మీ ముందుకు తీసుకువచ్చే ప్రయత్నమే ఈ వ్యాసం.

భారతదేశానికి గర్వకారణమైన చిత్రకారుడు వడ్డాది పాపయ్య. ఆయన ప్రముఖుల్లో ప్రముఖుడు, అపర బ్రహ్మ, చిత్ర కళాభిమానులకు దోసిళ్ళతో కళామృతాన్ని పంచి ఇచ్చిన కళామూర్తి. చిత్రకళను తపస్సుగా భావించి, జీవితాంతం కృషి చేసిన కళాజీవి. నేడు అసంఖ్యాకంగా ఉన్న ఆయన కళాభిమానుల ఇళ్ళల్లో ఆయన చిత్రాలు మనకు దర్శనమిస్తుంటాయి. ఆంధ్రప్రదేశ్‌లో వ.పా. కుంచెకు అంతక్రేజ్ ఉంది. అదే ఆయన చిత్రాల ప్రత్యేకత. దేవతలు సైతం ఆయన చేతిలో రూపు దిద్దు కోవాలని కోరుకుంటారంటే నమ్మకపోవచ్చు. సృష్టికర్త బ్రహ్మ సైతం తుళ్ళిపడి, ఆశ్చర్యపడే చిత్రాలు ఆయన సృష్టించారు. ప్రాచీన సాహిత్యాన్ని ఆకళింపు చేసుకొని తన కుంచెకు సాహితీ సౌరభాన్ని పులిమి, పరిమళాలను వెదజల్లే తన కాన్వాసుతో వెలుగు వింజామరలు విసరి వన్నెలు చిన్నెలు చిందించిన కళాకారుడు. కళాప్రియుల మనోకుడ్యాలపై ఆయన చిత్రాలు చెరగని ముద్రలు వేసాయి. రంగుల్ని సంకేతాలుగా చేసుకొని, భావాల్ని వెల్లడించడం ఆయన చిత్రాల్లో ప్రత్యేకత. ఆయన చిత్రాలు అభిమానులకు నేస్తాలు, కళామతల్లికి కంఠాభరణాలు.

వడ్డాది పాపయ్య పవిత్ర నాగావళి నదీతీరాన ఉన్న శ్రీకాకుళంలో 1921, సెప్టెంబరు 10న శ్రీరామమూర్తి, మహాలక్ష్మి దంపతులకు జన్మించారు. తండ్రి రామమూర్తి చిత్ర కళోపాధ్యాయులు కావడంతో వ.పా. తండ్రి వద్దనే చిత్రకళలో ఓనమాలు దిద్దినా, తనంతట తాను అహర్నిశలు

---

వై. అప్పారావు, కళాసాగర్‌గా ప్రసిద్ధులు, విజయవాడ,
వివిధ దిన, వార పత్రికల్లో వీరి వ్యాసాలు, చిత్రాలు ప్రచురింప బడ్డాయి.

కష్టించి, చిత్రాలు గీయడం నేర్చుకున్నారు. తండ్రి చిత్రరచనా పద్ధతిని ఏకాగ్రతతో ఆయన గమనించేవారు. ఐదవ యేటనే తండ్రి మిగిల్చిన రంగులతో 'హనుమంతు'ని చిత్రం తొలిసారిగా గీశారు. తీరిక సమయాల్లో తండ్రి పోతన భాగవతాన్ని వినిపిస్తూ ఉండేవారు. ఈ ప్రభావం వల్ల వ.పా.కి ఆధునికత కంటే ప్రాచీనత మీద, భారతీయ చిత్ర, శిల్ప కళల పట్ల మక్కువను కల్గించింది. తండ్రి తొలి గురువైతే రవివర్మ మలి గురువు. ఆయన బొమ్మలను నిమగ్నతాత్మక దృక్పథంతో చూస్తూ ఉండేవారు. దైవ సంబంధమైన చిత్రాలు గియ్యడానికి కూడా రవివర్మే ప్రేరణ అనేవారు.

పత్రికా చిత్రకారుడిగా : తొలుత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు వీరి చిత్రాలు పత్రికల్లో ప్రచురించి ప్రోత్సహించారు. అప్పటి నుండి రేరాణి, మంజూష, అభిసారిక, ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్రజ్యోతి తదితర పత్రికల్లో చిత్రాలు గీచేవారు. ఆ తర్వాత 'చందమామ' సంపాదకులు చక్రపాణి గారితో పరిచయం కల్గిన దగ్గర నుంచి దాదాపు అర్ధశతాబ్దం పాటు క్రమం తప్పకుండా 'చందమామ'ను తన కుంచెతో తీర్చిదిద్దారు. చక్రపాణి సంపాదకత్వంలో వచ్చిన మరో మాసపత్రిక 'యువ'లో ఆయన నెలకు నాలుగు వర్ణచిత్రాలు వేసేవారు. బహుశా ఇలా జరగడం అరుదు. వ.పా. చిత్ర కారుడేకాదు, మంచి కార్టూనిస్టు, కథా రచయిత కూడా. అప్పట్లో 'చందమామ'ను వివిధ భాషల్లో ప్రచురించడం వల్ల వ.పా. చిత్రాలు దేశవ్యాప్తంగా ప్రచారం పొందాయి.

'చందమామ'కు చిత్రాలు వేసే కాలంలో వ.పా. మద్రాసులో ఉండేవారు. ఆ పట్టణ జీవితంలో ఇమడలేక, అనారోగ్యం దృష్ట్యా చలన చిత్రాలకు కళాదర్శకత్వం వహించే అవకాశాన్ని సైతం వదులుకొని విశాఖ జిల్లా కశింకోటలో స్థిరపడి తన చిత్ర కళా వ్యాసంగాన్ని కొనసాగించారు. చందమామ, యువ, తర్వాత స్వాతి సపరివార పత్రిక, మాసపత్రికలు దశాబ్దకాలం పైగా వీరి చిత్రాలు ప్రచురిస్తున్నాయి. పునః ప్రారంభించిన చందమామ పత్రికలో కూడా వీరి చిత్రాలను తిరిగి ప్రచురిస్తే ఆబాలగోపాలాన్ని అలరించిన వారవుతారు.

మోడల్ అవసరం లేని చిత్రకారుడు : సాధారణంగా చిత్రకారులు తమ చిత్రాలకు మోడల్స్‌ను ఉపయోగించడం అనేది అనాదిగా వస్తున్నదే. 'మిస్టీరియస్ స్మైల్' మొనాలిసా చిత్రాన్ని కూడా లియోనార్డ్ డావిన్సీ మోడల్ ఆధారంగా చిత్రీకరించినదే. కాని, వ.పా. కంటికి కనిపించే అందమైన స్త్రీ, పురుష ప్రకృతి రూపాలను తన చిత్రాలలో చిత్రించే వారు. ఆయన తొలుత జానపద రీతుల్లో చిత్ర రచన ప్రారంభించినా తర్వాత సాంప్రదాయ, ఆధునిక విధానాలలో తనదైన సొంత శైలిలో చిత్రరచన అనితర సాధ్యంగా కొనసాగించగల్గారు. ఆయన చిత్రాలలో తెలుగుదనం, తెలుగు సంస్కృతి, ఆచార వ్యవహారాలు, అలంకరణలు, పండుగులకు ప్రత్యేక ప్రాముఖ్యత నిచ్చేవారు. నూనె రంగులు (ఆయిల్ కలర్స్) కన్నా నీటి రంగులలో అనుకొన్న ఎఫెక్టు సాధించవచ్చుననీ, చిత్రీకరణ కూడా త్వరితంగా పూర్తి చెయ్యవచ్చునని ఈయన అభిప్రాయం. అందుకేనేమో ఈయన అన్నీ నీటి రంగుల చిత్రాలే చిత్రీకరించారు. నీటి రంగులను కలపడంలోనూ, రంగుల వాడకంలోనూ

ఈయన రారాజు. వ.పా. రంగుల మిశ్రమం ప్రత్యేకంగా ఉంటుంది. అందుకు ఆయన చిత్రీకరించిన చిత్రాలే తార్కాణం. అనుకరణ వీలుకాని, అనితర సాధ్యమైన రీతిలో చిత్రాలు రూపొందించారు వ.పా.

ప్రచారానికిష్టపడని వ.పా. : వ.పా.కి ఏకాంతంగా, నిశ్శబ్దంగా వున్నప్పుడే చిత్రాలు గీయడం అలవాటు. ఆయన ఎక్కువగా రాత్రి వేళల్లో కళాసాధన చేసేవారట. ఆయనకు పరిచయస్తులు కూడా చాలా తక్కువే. బహుకొద్దిమందితోనే పరిచయాలు ఉండేవి. ముఖ్యంగా వ్యక్తిగత ప్రచారానికి ఆయన ఇష్టపడేవారు కాదు. *''ఒక వ్యక్తిని ప్రేమిస్తే ఊహకు తగ్గట్టు వారుండక పోతే నిరుత్సాం* ***కల్గుతుంది. కళాకారునిగా నన్ను అభిమానించవద్దు, నా కళనే అభిమానించండి''*** అని తన ***అభిమానులను కోరేవారు.*** వ్యక్తి ఆరాధనకన్నా, ఆవ్యక్తి సృజనాత్మకత కృషి, వారి గుణాలే నా కిష్టం అనేవారు. వీరి గురించి తెలుసుకోవాలని ఎంతోమంది వీరి ఇంటికి వెళ్ళి నిరాశతో వెనుదిరిగి వచ్చారు. వీరి అవసాన దశలో హైదరాబాద్ దూరదర్శన్ వారు ఇంటర్వ్యూ చెయ్యడానికి కెమెరాతో సహా 'కశింకోట' వెళ్ళినా వాళ్ళని నిర్మొహమాటంగా పంపివేసారు.

వ.పా. మిత్రుల బలవంతంపై ఖరగ్‌పూర్‌లోనూ, శ్రీకాకుళంలోనూ చాలా కాలం క్రితం తన వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించారు. తర్వాత ఎంతమంది కోరినా అంగీకరించలేదు. ఇటీవలే ఆంధ్రా ఆర్టిస్ట్సు, స్కల్ప్టర్స్ అండ్ కార్టూనిస్ట్సు అసోసియేషన్ వారు విజయవాడలో వీరి చిత్రాలను, స్లైడ్స్ ప్రదర్శనను యం.యస్. మూర్తి ఆర్ట్ గాలరీలో ప్రదర్శించి కళాభిమానులకు కనువిందు చేసారు. వీర్ని సత్కరించడానికి ఎందరో ఉత్సాహం చూపినా అందుకు ఆయన అనుమతించలేదు. వీటన్నిటికీ దూరంగా ఉండదల్చుకున్నానని అంటూండేవారు. సన్మానాలు, బిరుదులు అందుకునే అవసరం లేని మహా చిత్రకారుడు ఆయన. సామాన్యుల మనో నేత్రాలపై చెరగని ముద్ర వేసిన చిత్ర కళా తపస్వి వ.పా.

లోకానికి తెలియకుండా తనని తానే ఏకాంతంలో బంధించుకుని, మరెవరు దర్శించలేని దివ్య జ్యోతిర్మయి లోకానికి, తాను కన్న కలల ప్రపంచానికి, తన కుంచెతో ప్రాణప్రతిష్ట పొందిన దేవతల్ని కలుసుకోవడానికి 1992 డిసెంబరు 30న మహాభినిష్క్రమణ చేసి, కళాభిమానుల గుండెల్లో విషాదం మిగిల్చారు. *ఆయనది ఏడు దశాబ్దాల జీవితమే అయినా, ఆయన చిత్రాల ఆయుష్షు శతాబ్దాలు. ''లైఫ్ ఈజ్ షార్ట్; ఆర్ట్ ఈజ్ లాంగ్'' అన్న సూక్తి కొందరి విషయంలో అతికష్టపడి అన్వయించాల్సి వుంటుంది. కాని వ.పా. విషయంలో ఈ సూక్తి ఆయన కోసమే పుట్టినట్టే ఉంటుంది.*

ఆంధ్ర సంస్కృతీ, సాంప్రదాయాలను అజరామరంగా చిత్రించిన ఆ కళాతేజం లేక పోయినా, ఆయన సృష్టించిన వేలాది చిత్రాలు మన మనస్సుల్లో జీవించి ఉంటాయి. ఆ స్మృతి చిహ్నాల్ని, సంస్కృతులను కాపాడుకోవాల్సిన బాధ్యత మనందరిదీ.

*(డిసెంబరు 30న వడ్డాది పాపయ్యగారి వర్ధంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసం; ముఖచిత్రం, మరియు చివరి అట్టపై వారి పోట్రయిట్)*

# అమెరికా సాహిత్య భీతి

## (1930వ సం॥ నోబెల్ సాహితీ పురస్కారోపన్యాసము)

మూలము : సింక్లెయర్ లూయిస్    అనువాదము : డా॥ యు. ఏ. నరసింహమూర్తి

నోబెల్ సాహిత్య పురస్కారాన్ని పొందినందువలన కలిగిన [illegible] వెల్లడించవలసి వస్తే అవధులు దాటిన అసంగత వేగంతో [illegible]. నా [illegible] దాసరికం లేని ధన్యవాదాలతో తెలుపుకుంటున్నాను.

నేటి ప్రసంగంలో అమెరికన్ సాహిత్యంలోని కొన్ని ధోరణులను, ప్రమాదాలను, [illegible] ఉద్వేగ భరితాలైన వాగ్దానాలను గూర్చిన అభిప్రాయాలను వెల్లడించాలనుకుంటున్నాను. [illegible], వేస్ట్ మరుగు పరచకుండా మర్మం విడిచి చర్చించాలనుకుంటున్నాను. నిజాయితీ [illegible] అవమానపరచినవాణ్ణి అవుతాను [illegible], ఈ సమయంలో నా ప్రియతను దేశంలోని కొన్ని సంస్థలను గూర్చి, కొందరు వ్యక్తులను గూర్చి మీ ముందు కొంచెం అసభ్యంగా మాట్లాడక తప్పడం లేదు.

దయచేసి నేనిలా నా తీర్పు చెప్పుకుంటున్నానని మాత్రం అనుకోకండి [illegible]. అదృష్టం నాకు బాగా కలిసివచ్చింది. నేనెప్పుడూ బాధలు పడలేదు. [illegible]. ఎందరి ఔదార్యాన్నో చూశాను. కాలిఫోర్నియాలో [illegible] ప్రతిష్ఠ కల్గిన [illegible]. ఆయన నా Elmer Gantry చదివి ఒక మూకను నా మీదికి [illegible]. మెయిన్ రాష్ట్రంలో ఇంకొక పుణ్యపురుషుడున్నాడు. నన్ను క్రైము చెయ్యడానికి [illegible], ఋజువైన మార్గం దొరకనందుకు ఆయన ఆశ్చర్యపోతూ ఉంటాడు. ధరించడానికి [illegible] తిరస్కారం ఇంకొకటుంది. మరీ పాత పరిచయాలున్న పత్రికా విలేఖరులు కొందరున్నారు, తప్పటడుగులు వేసే రోజుల్నుంచి నేను మాకు తెలుసునన్న ధోరణిలో, నన్ను [illegible] నుండి ఏదో గొణుక్కుంటూనే ఉన్నారు. కాబట్టి వాళ్ళ దృష్టిలో నేను [illegible] మాత్రం కాదు. అప్పుడప్పుడిలా నాకు నా [illegible] ఉంటుంది. [illegible] అడపాతడపా ఉల్లాసంగా రాళ్ళు రువ్వుతున్నప్పుడు, అన్ని రాళ్ల దెబ్బలు తింటూ, [illegible] నిలుచుంటే నేను బుద్ధిమాలిన వాణ్ణవుతాను.

అమెరికన్ సాహిత్యాన్ని గూర్చి మీరు నమ్మదగ్గ ఆరోపణలేవీ ఇప్పుడు నా దగ్గర లేవు. [illegible] ఆరోపణ ఉంది. అమెరికా ఇప్పుడు పారిశ్రామికంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా పురోగమిస్తున్నది. ఇప్పుడు ఆ దేశానికి ప్రాణసదృశంగా, గౌరవార్హంగా కనిపిస్తున్నవి [illegible] మాత్రమే సాహిత్యం కాదు.

కొద్ది రోజుల క్రితం స్వీడన్‌కు ఓడసెక్కే ముందు మీరూ నేనూ ఒంటబట్టించుకోదగిన సంఘటన ఒకటి జరిగింది. దాని నుదహరిస్తాను. అమెరికాలో ఒక విద్యావంతుడు, గొప్ప సహృదయుడు

---

డా॥ యు. ఏ. నరసింహమూర్తి, విజయనగరం, మహారాజా కళాశాలలో
తెలుగు శాఖాధ్యక్షులుగా పని చేస్తున్నారు.

అయిన వృద్ధుడొకడున్నాడు. ఆయన చర్చి అధికారిగా, ఆచార్యుడుగా, రాయబారిగా పనిచేసినవాడు. ఆయన అమెరికన్ కళా సాహిత్య అకాడమీలో సభ్యుడు. విశ్వవిద్యాలయాలెన్నో ఆయనకు గౌరవ పట్టాలనిచ్చేయి. నాకు తెలిసి ఆయన చేపలవేటమీద చిన్నచిన్న సరదా వ్యాసాలు రాస్తూ ఉంటాడు. పరిగలు, రొయ్యలు ఏరుకుని బతికే ఆవృత్తి కళాకారుడు, అచ్చంగా దానినొక వినోద వ్యాపారంగా భావిస్తున్నాడని నేననుకోను. కాని ఆ వ్యాసాలవలన, మనకు చేపలు పట్టవలసిన అవసరం లేకపోయినా చేపల్ని పట్టడంలో ఏదో ఒక ముఖ్యమైన, ఆధ్యాత్మికమైన స్థితి ఉందని చిన్నతనంలోనే నేను తెలుసుకున్నాను.

అమెరికా సంస్థలను వేళాకోళం చేసే నావంటి వాడికి నోబెల్ సాహిత్య పురస్కారం ప్రదానం చేసి స్వీడిష్ అకాడమీ అమెరికాను అవమానపరచిందని ఈ విద్వాంసుడు బహిరంగంగా ప్రకటించేడు. ఒకప్పటి రాయబారి కాబట్టి ఆయన దీనినొక అంతర్జాతీయ ఘటనగా చిత్రించదలచుకుని, అమెరికా సాహిత్య హక్కుల సంరక్షణ కోసం స్టాక్ హోమ్‌కు నౌకాదళాలను పంపవలసిందిగా అమెరికా ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తాడో ఏమో నాకు తెలియదు. అలా చెయ్యడని అనుకుంటున్నాను.

డాక్టర్ ఆఫ్ డివినిటీ, డాక్టర్ ఆఫ్ లెటర్సు వంటి విశ్వవిద్యాలయ పురస్కారాలు, నాకు తెలియని ఇంకా ఎన్నో గణనీయమైన ఉన్నత గౌరవాలు పొందిన ఈ విద్యాధికుడు ఇలా భావించడంలో ఏదో తిరకాసు ఉందని నా కనిపిస్తోంది. ''వ్యక్తిగతంగా ఈ రచయిత పుస్తకాలకి వ్యతిరేకినే. అమెరికావారు ఇంకా శైశవదశ నధిగమించని ఆటవిక జాతిలా లేరని, విమర్శకు భయపడేటంత తక్కువ స్థాయిలో లేరని, పరిణత దశకు చేరుకున్నారని, ఎంత వేళాకోళంగా వాళ్ల దేశాన్ని విశ్లేషణ చేసినా నిశ్చలమైన పరిణతమైన బుద్ధితో గ్రహించగల సామర్థ్యం పెంచుకున్నారని అనుకుంటూ స్వీడిష్ అకాడమీ అమెరికాను గౌరవించే నిమిత్తమే, ఎవడైతేనేమిలే అని ఈ సాహిత్య పురస్కారానికి ఈ రచయిత నెన్నుకుని ఉంటుంది'' అని ఆయన తర్కించుకుంటూ ఉంటాడని నా భావన.

స్ట్రిండ్ బెర్గ్, ఇబ్సన్, పొంటొప్పిడన్ వంటి రచయితల రచనలు చదవడానికి అలవాటు పడిన స్కాండినేవియా - అమెరికా ఎంతో సంపన్నమైన శక్తివంతమైన దేశమై ఉండికూడా మానవాళి మౌలిక వాంఛలను తృప్తి పరచగల నాగరకతను సృష్టించ లేక పోయిందని ఆరోపించే అత్యంత అరాచక వాదంతో నిండిన నారచనలను చదివి విచలితం కాబోదని కూడా అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ఆ విద్వాంసుడు విశ్వసిస్తూ ఉంటాడని నేననుకుంటున్నాను.

స్ట్రిండ్ బెర్గ్ ఎప్పుడూ అమెరికా స్తోత్రపాఠం చెయ్యలేదని, రోటరీ క్లబ్బుల్లో ఉపన్యాసాలివ్వలేదని నేను విశ్వసిస్తున్నాను. అయినా స్వీడన్ ఇంకా ఆయనను సజీవంగానే నిలుపుకున్నట్లు తెలుస్తుంది.

ఏదో గ్రహించదగిన ప్రాధాన్యం ఉందని ఆ చదువుకున్న జాలరిని గూర్చి నేను ఇంత దూరం అతని విమర్శను మీ ముందుంచడంలేదు. అమెరికాకు చెందిన హెచ్చులొచ్చులన్నింటినీ స్తోత్రం చెయ్యని సాహిత్యాన్ని చదవడానికి, సృష్టించడానికి చదువరులు, రచయితలు ఇప్పటికీ ఎంతగా భయగ్రస్తు లౌతున్నారో ఉదాహరించడానికే ఇదంతా చెప్పుకొచ్చేను. ఒకనవల అమెరికాలో అత్యధికంగా అమ్ముడు

పోవాలంటే, ఒక నవలాకారుడు అమెరికా వారికి ప్రీతిపాత్రుడు కావాలంటే అతడు తప్పనిసరిగా ప్రకటించవలసిన అంశాలు కొన్నున్నాయి అమెరికా వారు నాయకులు, సుందరులు, ధనవంతులు, నిజాయితీ పరులు, గోల్ఫ్‌లో ఎదురులేని క్రీడాకారులు. ఆ దేశంలోని సగటు సంసారి వైవాహిక జీవితంలో ఇరుగు పొరుగువారితో పరస్పరం దయకలిగి ప్రవర్తిస్తూ ఉంటారు. అమెరికా యువతులు మరీ విచ్చలవిడిగా తిరిగినా వాళ్ళు ఆదర్శప్రాయులైన భార్యలుగా, తల్లులుగా మారిపోతారు. భౌగోళికంగా, అమెరికా అంతా న్యూయార్క్‌లాగే ఉంటుంది. అక్కడుండేవారంతా కోటీశ్వరులే ఉంటారు. పశ్చిమ రాష్ట్రాల్లో ఇప్పటికీ 1870ల నాటి కోలాహలం ఉల్లాసం నిండిన పరాక్రమం కనిపిస్తోంది. దక్షిణ రాష్ట్రాల ప్రజలంతా ఇప్పటికీ నిరంతరం మైదాన తోటల మధ్యే, సుగంధ పరిమళాలు వెదజల్లే తోటల్లోనే జీవిస్తున్నారు.

ఇరవైయేళ్ళ కిందట అమెరికాలో బహుళ ప్రచారం పొంది, జనాన్ని ప్రభావితం చేయగల అసలైన నవలా రచయితలుండేవారు. స్వీడన్లో మీరు చదివిన డ్రైజర్, విల్లా కేథర్ వంటివారు వారు. ఇప్పుడలాంటి వారున్నారన్నది సత్యదూరమైన మాట. నేనింతకుముందు పరిచయం చేసిన, సుప్రసిద్ధుడైన విద్యాధికుని మాదిరిగానే మేమంతా, నూటయిరవై మిలియన్ల జన సంఖ్యతో పెరుగుతున్న అమెరికా పదకొండు మిలియన్ల జనాభా ఉండే రోజుల్లోని అమెరికాలాగే నిరాడంబరమైన గ్రామీణ నైర్మల్యం నిండి ఉన్న దేశంగా ఎంచి మనఃపూర్ణమైన, నైతిక బృందగానాల నాలపించే, ప్రజాభిమానాన్ని మాత్రమే ఆశించే పద్ధతిలో రచనలు చేసే రచయితలనే ఎక్కువగా గౌరవిస్తున్నాము. జమీందారు ఇళ్ళల్లో 1840లో ఉండే స్త్రీకి యజమానికి పనివాళ్ళకు మధ్య ఎంత సరసమైన, స్నేహ సంబంధాలుండేవో ఇప్పుడు పదివేల మందితో నడిచే కర్మాగారంలో కూడా ఆ సంబంధాలే ఉన్నాయనుకుంటున్నాము. 1880లో రోజ్‌వుడ్‌తో ఆచ్ఛాదింపబడిన ఐదుగదుల కాటేజీలో నివసించే కుటుంబంలోని భార్యాభర్తల మధ్య, తండ్రీ కొడుకుల మధ్య ఎలాంటి సంబంధాలుండేవో, ఈరోజు ముప్పై అంతస్తుల భవనంలోని అపార్టుమెంటులో, మూడు మోటారు కార్లలో, ఐదు పుస్తకాల గ్రంథాలయంలో, వచ్చే వారం పుచ్చుకోబోయే విడాకులలో- జీవించే కుటుంబంలోని భార్యాభర్తలమధ్య, తండ్రీ కొడుకుల మధ్య కూడా నూటికి నూరుపాళ్ళు అలాగే ఉంటున్నాయి. అంకుల్ శామ్ కాలం నాటి గ్రామీణ నైతిక నైర్మల్యం నిండిన నిరాడంబర లక్షణం ఈషణ్మాత్రమైనా మారకుండా ఉగ్రమైన అమెరికా ప్రపంచ సామ్రాజ్యంగా విప్లవాత్మకమైన మార్పు పొందింది. ఇది మణిప్రవాళంలాంటి మాట.

ఆ చేపలు పట్టే విద్యాధికుడు నన్ను తీసిపారేసినందుకు నేను బహుధా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఆయన అమెరికా కళా సాహిత్య సంస్థలో ప్రముఖ సభ్యుడు. ఆయిన నా గురించి ఎలా మాట్లాడేడు, నేను కూడా అంతే స్వేచ్ఛగా కుండ బద్దలు కొట్టినట్లు ఆ సంస్థను గూర్చి మాట్లాడే హక్కు నాకిచ్చాడు. ఈనాటి అమెరికా మేధో మార్గాన్ని గూర్చిన నిజాయితీకల ఏ అధ్యయనమైనా ఆ వింత సంస్థను గూర్చి ఆలోచించి తీరాలి.

ఆ అకాడమీని గూర్చి ఆలోచించే ముందు, గడచిన కొద్ది రోజులుగా కల్లోలిత అట్లాంటిక్ సముద్ర జలాల్లో ప్రయాణిస్తూ అనివార్య నిర్వ్యాపారానికి లోనైనప్పుడు నన్ను ఉల్లాస పరచిన ఒక స్వైర

కల్పనాత్మక వ్యంగ్య చిత్రాన్ని మీ ముందుంచనీయండి. మీరు నాకిచ్చిన నోబెల్ పురస్కారం అమెరికా ప్రజాసహామతిని పొందలేదని ఈ పాటికి మీ అందరికి తెలిసి ఉంటుందని ఖచ్చితంగా అనుకుంటున్నాను. ఈ అనుభవం మీకు కొత్తది కాదని నిస్సందేహంగా చెప్పగలను. ఐరోపా మేధాసంపత్తి నంతటిని తనలో గర్భీకరించుకున్న Zauberbergను రచించిన థామస్ మాన్‌కు మీ పురస్కారం లభించినప్పుడు నేనెంతో సంబరపడ్డాను. బ్రిటిషు సామ్రాజ్య నిర్మాతగా ప్రగాఢమైన సామాజిక ప్రాధాన్యాన్ని సంతరించుకున్న కిప్లింగ్‌కు మీ పురస్కారాన్నిచ్చినప్పుడు కూడా నేనెంతో ముచ్చట పడ్డాను. బెర్నార్డ్ షాకు నోబెల్ పురస్కారం లభించినప్పుడూ అంతే. కాని ఆయాదేశాల ప్రజల్లో మాత్రం మీకు వేరెవరూ దొరకని కారణంగానే వారికి ఆ పురస్కారాల నిచ్చేరని ఆరోపణ చేసిన వారున్నారు.

మీరు నన్ను కాక ఇంకొకరిని అమెరికా రచయితను, ఉదాహరణకు థియోడర్ డ్రైజర్ (Theodore Dresier)ను ఎన్నుకొని ఉంటే వాళ్లేమని ఉండేవారో కూడా నేను ఊహించాను.

నా దృష్టిలో, చాలామంది ఇతర అమెరికా రచయితల దృష్టిలో, డ్రైజర్ ఏ ఇతర వ్యక్తితో పోల్చి చూసినా మరీ ఒంటరిగా సాగి పోతున్నాడు. సాధారణంగా అతన్నెవరూ ప్రశంసించరు. తరచుగా అసహ్యించుకుంటారు. అతడు అమెరికా కాల్పనిక సాహిత్యాన్ని విక్టోరియా కాలపు, హోవెల్స్ కాలపు సిగ్గరితనం నుండి మృదుత్వం నుండి నిజాయితీకీ, ధీరతకు, జీవన సారస్యానికి మళ్లించే ప్రయాణాన్ని విశదం చేసేడు. అతడు అగ్రగామి కాకపోయినట్లైతే, మాలో ఏ ఒక్కరమూ, జైలుకు పోవడానికి తెగిస్తే తప్ప, జీవితాన్ని, అందాన్ని, భీభత్సాన్ని అభివ్యక్తం చేయగలిగే వాళ్లమా అని నా సందేహం.

నా సహచరులలో గొప్పవాడైన షేర్‌వుడ్ ఆండర్సన్ డ్రైజర్ నాయకత్వాన్ని ప్రకటించాడు. నేను సంతోషపూర్వకంగా ఆయన ననుసరించేను. Sister Carricఅనే తన గొప్ప మొదటి నవలను సాహసోపేతంగా ప్రచురించి ముప్పై సంవత్సరాలయింది. పాతికేళ్ల క్రిందట నేనా నవలను చదివేను. గాలిలేక అల్లాడుతున్న అమెరికా కుటుంబాల్లోకి ఆ నవల ధారాళమైన పశ్చిమ పవనంలా వీచింది. మార్క్‌ట్వైన్, విట్మన్‌ల తర్వాత వెలుగు లేని మా సాంసారిక జీవితాల్లోకి స్వచ్ఛమైన ప్రాణవాయువును ప్రసరింప జేసింది.

అయినా డ్రైజర్‌కు మీరీ పురస్కారాన్నందజేసి వుంటే అమెరికావాళ్ల మూలుగులెన్నో విని ఉండేవారు. ఆయన శైలిలోని మార్మికలక్షణమిదీ అనినేను తూచినట్లు చెప్పలేను. కాని చాలామంది ప్రారంభ విమర్శకుల రాతల్లో ఆ మాట దొర్లుతూ ఉండడం చూసేను. మార్మికత ఆయన శైలిలో ఉందనే అనుకుంటున్నాను. ఆయన శైలి గుదిబండలాంటిదని, ఆయన వాడే పదాలు స్ఫూర్తి దాయకాలు కావని, ఆయన పుస్తకాలు చేట భారతాల్లా విసుగెత్తిస్తాయని మీరు వినేవుంటారు. డ్రైజర్ రచనా ప్రపంచంలోని స్త్రీ పురుషులు సాధారణంగా పాపచింతన, విషాదం, నిర్వేదం నిండిన వారుగా కనిపిస్తారు, కాని అచ్చమైన అమెరికావారిలో నిరంతరం నవ్వుతూ తుళ్లుతూ ఉండే సజ్జనుల్లా ప్రకాశించే అమెరికా వారికి సరితూగినట్లు ఉండరని ప్రసిద్ధ విద్వాంసులు తప్పుపడుతూ ఉంటారు.

యూజీన్ ఓనెల్ (Eugene O'Neil) అమెరికా నాటకరంగాన్ని సమూలంగా మార్పడానికి పరిశుభ్రంగా, సర్వసమర్థంగా ఉంటే అమెరికా బూటకపు లోకాన్ని ఔన్నత్యం - భయం - గొప్పతనం నిండిన లోకంగా పది పన్నెండేళ్లలో మార్చేడం కంటే వేరే ఏమంత ఎక్కువగా చేయలేదు. ఒకవేళ మీ పురస్కారానికి మీరతనిని ఎన్నుకుని ఉంటే, విద్వాంసులు అంచనా వేసే విధంగా అమెరికా జీవితాన్ని అన్నీ అమరిన పరిశుభ్ర జీవనంగా కాక, భయోత్పాతాన్ని కల్పించేదిగా విస్తారంగా పెంగిన వానిగా, తుఫాన్లు, భూకంపాలు, కార్చిచ్చులు తరచుగా సంభవించే దేశంగా చిత్రించి అధిక్షేపించడంకంటే ఇంకా నికృష్టమైన రీతిలో రచనలు చేసిన వానిని గౌరవించేరని మిమ్మల్ని హెచ్చరించి ఉండేవారు.

మీరు జేమ్స్ బ్రాంచ్ కేబెల్‌కు నోబెల్‌పురస్కారాన్నియిచ్చివుంటే మర్యాదస్తులైన అయిన ఉద్యోగులైన వారు మీకు చెప్పివుండేవారు. నెబ్రాసా రైతుల కుటుంబ జీవన సౌందర్యాన్ని అమోఘంగా చిత్రించిన విల్లా కేథర్ (Miss Willa Cather) విషయంలోనూ వాళ్లు మీకు ఇలాగే చెప్పి ఉండేవారు. ఆమె రచించిన The Last Lady అన్న నవలలోని కథలో నీతి లేదు. పెలిపెట్టి ఆ నాయిక ఉదారులకు కూడా దారుణ ప్రియదర్శనాన్నిస్తుంది. అలాంటి నాయికను సృష్టించడం నిర్భీతి మయిన, విస్మయం పుట్టించేటంతటిది, కొట్టొచ్చినట్టు కనబడేది అయిన అమెరికా ఉదారశీలానికి వ్యతిరేకమైనదని అని ఉండేవారు. మిస్టర్ హెన్రీ మెంకన్ మేధాకోశం మనుష్యులందరలోనూ మరీ భ్రష్టము. మిస్టర్ షేర్‌వుడ్ అండర్సన్ చేపలు పట్టడం లాగే కామం కూడా జీవితంలో ఒక ముఖ్యమైన అంశం అని పరిగణించి ఘోరమైన తప్పిదం చేసేడు. అమెరికా ధనస్వామ్యవాదుల గుత్తాధిపత్యంలోని సౌష్టవాన్ని వ్యతిరేకించి సామ్యవాదిగా మిస్టర్ అప్టాన్ సింక్లెయర్ పాపం మూటకట్టుకున్నాడు. దైనందిన జీవనం ఒక ఉదాత్త పణితి, ఉపరితల సౌందర్యం కల ఒకానొక ప్రాధాన్యం కలదిగా భావించడం వలన జోసెఫ్ హెర్గ్‌షీమర్ (Mr. Joseph Hergesheimer) అమెరికా లక్షణాలను కోల్పోయేడు. పెర్షింగ్ హెమింగ్వే బద్మాషుడు. మరీ భ్రష్టుడు. మర్యాదస్థులు వినకూడని భాషలో రాస్తాడు. త్రాగుడు మనిషి సుఖానికి అనాదిగా ఏర్పడిన మార్గమంటాడు. యుద్ధంలో మనుషుల్ని ఊచకోత కొయ్యడం కంటే ప్రేమించడం మంచి దంటాడు. ఇవీ వాళ్లు చెప్పే మాటలు.

అవును, ఈ నా సహచరులందరూ దుష్టులు. ఈ పురస్కారానికి మీరు నన్నెను ఎన్నుకునేకన్నా ఎన్నుకున్నంత పాపమూ చేసి వుండేవారు. 1880లో కాకుండా 1930లో ప్రతిష్ఠిత స్థిరమైన భవిష్యం నిండిన అమెరికావాడిగా వాళ్లందరూ నాదేశపు స్త్రీ పురుషులని నేను సంతోషిస్తున్నాను. థామస్ మాన్, హె. జి. వెల్స్, గాల్స్‌వర్దీ, నట్ హామ్సన్, ఆర్నోల్డ్ బెన్నెట్, ఫ్రాంక్ వేంగర్, సెల్మాలేగర్లోఫ్, సిగ్రిడ్ అండ్సెట్, వెర్నర్ వాన్ హైడెన్‌స్టామ్, డె అన్నుంజియో, రోమా రోలండ్‌లను గూర్చి యూరోపులో కూడా నేను గర్వంగా మాట్లాడగలను. ఈ ప్రసంగంలో ఆశావాదంలోంచి నిరాశావాదంలోకి, ఇంకా వెనక్కి అదేపనిగా తూలిపోవడం నా దురదృష్టం. అమెరికాకు సంబంధించి దేనిగురించైనా ప్రసంగించేవారికి, రాసేవారికి ఇదే గతి పడుతూంది. వర్తమాన ప్రపంచంలోని ఏ ఇతర దేశంకన్నా కూడా అమెరికా వైరుధ్యాలతోనిండివుంది; మరీ మరీ నిరాశాజనకంగా వుంది; మరీ మరీ రెచ్చగొట్టేదిగా వుంది.

వర్తమాన అమెరికా సాహిత్య జీవితంలోని గొప్ప స్త్రీ పురుషుల పాత్రను గూర్చి గర్వంగా చెప్పడానికి నాకింకా నాలుక పడిపోలేదు. సమయాభావం కారణంగా ఇప్పటికే ఒక డజను పేర్లు విడచిపెట్టేను. వాళ్ల గొప్పతనం గూర్చి నా కెంతో గొప్పగా చెప్పాలని వుంది. వాస్తుకళలోను, సినిమా కళలోను, వాణిజ్య విజ్ఞానశాస్త్ర రంగాలలోను ప్రోత్సాహకరమైన, శక్తిమంతమైన ప్రమాణాలు సాధించిన అమెరికా వారు సమకాలీన అమెరికా సాహిత్యంలో ప్రమాణాలు లేకుండా పోయాయి ఆరాధించదగ్గ నాయకులు లేరు. తుడిచి పెట్టదగిన ప్రతినాయకులు లేరు. అనుసరించ దగిన మార్గాలు లేవు. తప్పించుకోదగిన భయంకరమైన త్రోవలు లేవు.

అమెరికాలో నవలాకారుడు, కవి, నాటకకర్త, శిల్పి, చిత్రకారుడు ఒంటరిగా పనిచేయక తప్పదు. గందరగోళం మధ్య పనిచేయక తప్పదు. వారి చిత్తశుద్ధే వారికి శ్రీరామరక్ష, ఇంకొకసహాయం ఉండదు.

అసలెప్పుడూ కళాకారుడి అదృష్టమే అంత. తిరుగుబోతు నేరస్థుడు అయిన ఫ్రాంకోవిల్లన్‌కు ఆత్మ తృప్తి అనేది లేనేలేదు. పద్మినీ జాతి స్త్రీలు అతనిని చేపట్టి నకనకలాడే ఆత్మకు, వెన్నుకంటుకున్న డొక్కకు ఊరట కల్పించి ఉండగల సదుపాయంగల ఆశ్రయం లేదు. ఆయన సార్థక నామధేయుడైన గొప్పవ్యక్తి. చరిత్రలో అందరు సంస్థానాధీశ్వరులకన్న, ప్రధానాధికారులకన్న ఎక్కువ కాలం జీవించ దగినవాడు. కాని వారి ఆధికారిక వస్త్రాలను స్పృశించే అర్హతలేనివాడనే గౌరవం దక్కిందాయనకు. అతనికి దక్కిన అదృష్టం మురికివాడలు మాడుపెచ్చులు.

అమెరికాలో కళాకారుడికి అలాంటి దరిద్రం లేదు. అక్కడ కావలిసినంత డబ్బిస్తారు. ఒక బట్లరు, కారు, పామ్ బీచ్‌లో భవనం, కోటీశ్వరులతో అరమరికలు లేనంత స్వేచ్ఛగా సమానంగా కలిసిపోగల అవకాశం లేకపోతే రచయితగా అతడు పనికి రానట్లే అనుకోవాలి. కాని దరిద్రం కంటె నికృష్టమైన శక్తి ఏదో అతన్నెప్పుడూ పాతాళానికి తొక్కేస్తూ ఉంటుంది. అతడు రాసిందెవరూ పట్టించుకోరనే భావం వేధిస్తుంది. పాఠకులెప్పుడూ అతడు సౌందర్య సాధకుడుగా విదూషకుడుగా ఉండాలనుకుంటారు. తనకరుపు అంటే అరుపే చండాలంగా ఉండే సాధు హృదయుడిగా అంగీకరిస్తారు. ఎనభై అంతస్తుల హర్మ్యాలు, మిలియన్ల కార్లు, బిలియన్ల గరిసెల గోధుమలు ఉత్పత్తి చేసే దేశంలో నిశ్చయంగా అతన్నే సందర్భంలోను గుర్తించరు. అతని నుత్తేజపరచడానికి, సద్విమర్శ చేయడానికి, విలువైన ప్రశంసలందించడానికి ఒక సంస్థగాని, ఒక వర్గంగాని లేదు.

మాకున్న సంస్థలేమిటి? అమెరికా కళా సాహిత్య అకాడమీలో ఎందరో గొప్ప చిత్రకారులు, వాస్తుశిల్పులు, రాజనీతిజ్ఞులు ఉన్నారు. గౌరవనీయులైన విశ్వవిద్యాలయాధ్యక్షులు నికొలస్ ముర్రే బట్లర్ ఉన్నారు. ఆరాధ్యుడు, సాహసి అయిన విద్వాంసుడు విల్బర్ క్రాస్ ఉన్నారు. ఎడ్విన్ ఆర్లింగ్‌టన్ రాబిన్సన్, రాబర్ట్ ఫ్రాస్టు వంటి కవులు, స్వతంత్ర బుద్ధితో వ్యవహరించే పత్రికా రచయిత జేమ్స్ ట్రూస్లో ఆడమ్స్, ఎడిత్ వ్హార్టన్, హామ్లిన్‌గార్లండ్, ఓవెన్‌విస్టెర్, బ్రాండ్‌వైట్‌లాక్, బూత్ టార్కింగ్టన్ వంటి నవలాకారులు - ఇలా ఎందరో ప్రథమశ్రేణి రచయితలున్నారు. (సశేషం)

# రెప్పబాటు లోకంలో...

– వి. అశ్వినికుమార్

**ముందుమాట:**

పారిస్‌లో ''ఎల్లే'' పత్రిక సంపాదకుడు 'జీన్ డొమినిక్ బాబీ' (43 సం॥) ఒకరోజు మధ్యాహ్నం కారులో ప్రయాణం చేస్తూ హఠాత్తుగా కోమాలోకి జారిపోయాడు (డిసెంబరు 8, 1995).

అతని రోగాన్ని 'లాక్డ్ ఇన్ సిండ్రోమ్' అన్నారు. శరీరమంతా చచ్చుబడిపోయి, మెదడు మాత్రం పనిచేస్తున్నది! కేవలం ఒక ఎడమ కనురెప్ప కదిలించగలుగుతున్నాడు!

ఆ రెప్ప పాటు కదలికతో అక్షరం కూర్చి ఎన్ని భావాల్ని వాక్యాల్ని ఓర్పుగా ఒక సెక్రటరీ సాయంతో పుస్తక రూపంలో తెచ్చాడు!

* * *

ఆ రోజు కూడా ఉదయాన్నే నిద్రలేచాను కాని అదే - స్వతంత్రమైన దినం చివరిసారి అని అనుమానం రాలేదు!

ఆకాశం మబ్బులతో ముసుక బారింది. వాతావరణం మూగగా మూలుగుతోంది. జనాలు ఏదో దిగులుగా తలలు వంచుకుని సాగిపోతున్నారు. పారిస్ బస్సులు ట్రైన్లు అన్నీ సమ్మెలో ఉన్నాయి. అస్తవ్యస్తమైన జన జీవితం - ప్రతి పౌరుడు ఏదో శిక్షలాగా అనుభవిస్తున్నాడు.

నేను కూడా - ఈ అయోమయంలోనికి అడుగుపెట్టాను. రోజువారీ పనులు; ఇప్పుడవే ఒక మాయలా అన్పిస్తున్నా; మామూలుగానే జరిగిపోయినాయి.

ఈ రోజే కదా ఆ కొత్తమోడల్ జర్మనీ కారు తీసుకురమ్మని చెప్పాను! పారిస్‌కి దూరంగా ఉన్న మా బాబు థియోఫిల్‌ని - ఇంటికి తీసుకురావాలని అనుకున్నాను!

ఎపార్ట్‌మెంటు మెట్లు దిగుతుంటే కొత్తగా పెట్టిన పాలిష్ వాసన వస్తోంది...

ఇదే చివరి వాసన - నాకు తెలిసేది అని కూడా తెలుసుకోలేకపోయాను!

అదిగో తళ తళ మెరిసే కారుని ఆనుకుని తెల్లని దుస్తుల్లో నవ్వుతూ నిలబడి ఉన్నాడు డ్రైవర్.

'ఎల్లే' పత్రిక కార్యాలయంలోనికి రావటం - ఎడిటోరియల్ గదిలో మధ్యాహ్నం వరకు అంతా సవ్యంగానే జరిగిపోయింది!

లంచ్ అందరం కలిసే చేశాం. అప్పుడు కూడా అదే ఆఖరి భోజనం అని అనుమానం రాలేదు! మెల్లగా ఆఫీసు గది వదిలి క్రిందికి వచ్చి కారు డ్రైవరు సీటులో కూర్చుని బాబు దగ్గరకు బయలు దేరాను - అప్పటికి మధ్యాహ్నం 3 గంటలయింది! కారు పోనిస్తుంటే - రోజు తిరిగే రోడ్డయినా - అంతా కొత్తగా అన్పించసాగింది. ఏదో తెలియని చోటుకు పోతున్నట్లు మా కారుని దాటి పోతున్న కారు - రెండుగా కన్పించింది!

అక్కడ కూర్చున్నది బాబు కదూ! సరిగ్గా కనపడటం లేదేమి? బాబుని కారెక్కించుకుని - డ్రైవర్‌ను కారు పోనిమ్మని - నేను వెనుక సీటులో కూర్చున్నాను. తలంతా ఇలా చెమటలు

---

వి. అశ్వినికుమార్, పాన్ ఏషియన్ ట్రావెల్ ఏజన్సీ ప్రెసిడెంట్, విజయవాడ,
సాహితీ వ్యవసాయం అభిరుచి.

కారుతున్నాయేమిటి? నా తల వాలిపోతుంటే అంతా అయోమయంగా అయిపోతుందేమిటి? అక్కడికి దగ్గర్లో వున్న - చెల్లి - నర్స్ డైయోని దగ్గరకు పోనిమ్మన్నట్లు గుర్తు - ఆ తర్వాత ఎక్కడికి జారిపోతున్నాను? ఏదో చెప్పాలని - కానీ ఏ శబ్దం రావటం లేదే! ఏమిటి ఇది నిద్రా? చీకటా? నీటిలో మునిగిపోతున్నానా? ఎంతలోతు? అడుగెక్కడ? ఎంత దూరం? ఎంతకాలం - ఏమయింది?...

## జీవిత ఖైదు:

ఆ నలిగిన తెరల్లోనుంచి వెలుతురు తొంగి చూస్తోంది. అంటే తెల్లవారిందన్నమాట. నా తల, ఒక టన్ను బరువు పెట్టినట్లుంది మెడమీద!

కాలి మడమలు మండి పోతున్నాయి. శరీరంలో ఏ భాగమూ కదలిక లేదు. ఒళ్లంతా ఇనుప చట్రంలో బిగించి - తల ఒక్కటే మర్చిపోయారు ఎవరో. కారాగారంలో శరీరం వుందో, లేక శరీరమే కారాగారంలా మారిపోయిందో ఇప్పుడు నాకు ఏదయినా - ఒక్కటే!

ఇప్పుడేమిటి? సంవత్సరం నుంచీ ఇదే స్థితి! నా జీవితాన్ని ఎవరో తుంచివేశారు పువ్వునూ కాడనూ వేరు చేసినట్లు!

మెల్లమెల్లగా వెలుతురు గదిలో పరుచుకుంటోంది. నా చిట్టి తల్లి సెలిస్టీ నవ్వుతున్న ఫోటో; నా భార్య (సిల్వెస్టి) మెరిసేకళ్లు - బాబు యూనిఫాం అన్నీ కనపడుతున్నాయి.

నాకు ఆహారం పోస్తూ - గాలి అందిస్తున్న గొట్టాలు - సూదులూ వ్రేలాడుతున్నాయి. నేను పడివున్న ఆసుపత్రి మంచం - నన్ను బందీ చేసిన రోగం - అన్నీ తెలుస్తున్నాయి!

ఒక బ్రెయిన్‌స్టెమ్ వుంటుందని నాకు తెలియదు. దానికీ, వెన్ను పూసకీ ఏదో లింకు వున్న సంగతి అసలే తెలియదు.

ఏమి జరిగిందని - ఆ లింకు తెగిపోయింది? మొండెం చచ్చుపడిపోయింది. మెదడు మాత్రం పని చేస్తున్నది. నేను ఈ శరీరంలో బందీని! కదల్లేక మాటరాక, వినికిడి తగ్గి - ఒక్క కనురెప్ప అదీ ఎడమ కనురెప్ప ఒక్కటే నా ఆధీనంలో వుండి, మిగతా శరీరం అంతా మాంసం ముద్దలా మిగిలిపోయింది.

కదలిక లేని ఈ శరీరం - వీడని జైలు! జీవిత ఖైదు అనుభవించవలసిందని నాకీ యావజ్జీవ కారాగార శిక్ష ఎందుకు, ఎవరు వేశారు?

## చక్రాల కుర్చీ:

ఇరవయి రోజులు మాయలాంటి, మంచుపొరలాంటి, అపస్మారక స్థితిలో నుండి మెలమెల్లగా ఈదుకుంటూ పైకి తేలి తెలుసుకునే సరికి ఈ ఆసుపత్రి 119వ గదిలో పడివున్నాను. ఇంగ్లీష్ ఛానెల్ ప్రక్క ఫ్రెంచ్ తీరంలోని బెర్సెక్‌లో రెండవ ప్రపంచ యుద్ధంలో గాయపడిన వారి కోసం ఎర్రని ఇటుకలతో కట్టిన ఆసుపత్రి ఇది. ఇక్కడ నాకేం పని? మంచం ప్రక్కనే చక్రాల కుర్చీ కనపడుతోంది.

ఆరోజు చక్రాల కుర్చీ వాళ్లు తోసుకువచ్చిన రోజు!

అప్పటి వరకూ నాకేమయిందో తెలియని స్థితి. నా కదలిక - నా మాట, మళ్లీ మామూలు అవుతుందని ఆశతోనే వున్నాను. కాని చక్రాల కుర్చీ తెచ్చి - నాకు మంచి బట్టలు మార్చి (నాలో నమ్మకం కలిగించటానికని అన్నారు.)

ఇక ఇదే నీ ప్రపంచం - ఇదే నీ కదలిక అని శాసనం రాసి, వైద్యులు వెళ్లిపోయారు! నర్సు వచ్చి, వార్డ్‌బాయ్ సాయంతో నన్ను కుర్చీలోకి మార్చి - ఆసుపత్రి వరండాలు అన్నీ త్రిప్పి తలవాలిపోతుంటే, ప్రత్యేకమైన దిళ్లు పెట్టి ''ఈ కుర్చీ మీకు బాగా కుదిరింది - ఇందులో మీరు సుఖంగా వుండగలరు'' అని అన్నప్పుడు నాకు జీవిత ఖైదు విధించినట్లనిపించింది! నా మెడ మీద తలారి కత్తి పడినట్లు వణికిపోయాను!

గమ్మత్తుగా, ఈ చక్రాల కుర్చీలో నేను 'సెటిల్' అయినా తర్వాత నా శ్రేయోభిలాషులు అందరూ వచ్చి - అన్ని విషయాలు చెప్పటం మొదలు పెట్టారు. నా స్థితి, స్థిరపడిన తర్వాత ఇక అది మామూలు అయిపోయింది. అన్ని విషయాలు, చివరికి నా రోగం - ''లాక్‌డ్ ఇన్ సిండ్రోమ్'' కూడా నిర్భయంగా చర్చించుకున్నాము!

ఈ రోగం రావటం - లాటరీ గెలవటం ఒకటే!

అది అంత అరుదైన విషయం మరి!

చచ్చుబడిన నా నరాలు మళ్లీ పని చెయ్యాలి అనుకుంటే - ఇంతవరకూ అలాంటి దాఖలాలు లేవు - అది కూడా నత్తనడకే. అదృష్టం బాగుంటే ఈ గొట్టాలు లేకుండా గాలి పీలవ గల్గటం కొన్నాళ్లలో సాధ్యం కావచ్చు!

**దీప స్తంభం:**

సరే వెలుతురు ముదిరింది కదా 8.30 గంటలకు ఫిజియో థెరపీ కోసం 'బ్రిగెట్' వస్తుంది. నాకాళ్ళూ, చేతులు, వ్యాయామం చేయిస్తుంది. అర చేతులు రాస్తుంది. తన చేయిని నొక్కమని అంటుంది. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. కాని ... నా చచ్చుబడిన చేతిని మంచం మీద పెడుతుంది.

చివరికి నా ముఖం మీద మసాజ్ చేస్తుంది. సగం స్పర్శజ్ఞానం మిగిలి వుంది. అది కూడా ఎడమ వైపు మాత్రమే సరిగ్గా నా పెదవులు సూనానికి గీత గీచినట్లు ఎడమవైపునే తెలుస్తుంది. నాకు - నేను సగం నవ్వు నవ్వగలను - అది ఎదుటివారికి తెలియాలి కదా!

నన్ను వారానికి ఒకసారి స్నానం చేయిస్తారు. ఈ స్నానం ప్రక్రియ నన్ను విపరీతమైన మానసిక క్షోభకు గురి చేస్తుంది.

ఒకప్పుడు - 'మార్టిని' ప్రక్కన పెట్టుకుని, దినపత్రికల దొంతర్లు పట్టుకుని, గంటల తరబడి, బాత్‌టబ్‌లో గడిపేవాడిని నా కాలి బొటన వ్రేళ్లతో వేడి, చన్నీటి పంపులు తిప్పుతూ - గోరు వెచ్చని ఆనందాన్ని అనుభవించేవాడిని.

ఇప్పుడు - నా దయనీయ స్థితి నాకే భయంకరంగా తోస్తున్నది. రోజూ ఉదయం పదిగంటలకు వార్డ్ బోయ్ వచ్చి చక్రాల కుర్చీలో నన్ను ఆసుపత్రి వరండాలలో త్రిప్పుతాడు.

ఒక గంట, గమ్యం లేకుండా తిరుగుతాము.

మధ్యలో నాతల వాలిపోతుంటే సరిచేస్తాడు. నారెప్పపాటుతో అతనికి కృతజ్ఞతలు తెలియజేస్తాను. అది అతని వరకూ చేరాలి కదా!

ఈ గంట పూర్తిగా అతనికే వదిలివేస్తాను. ఎందుకంటే ఈ విధంగా ఎన్నో అనుకోని కొత్త ముఖాలు, తెలియని కోణాలు ఆసుపత్రిలో చూడగలిగాను. ఆ రోజు అనుకోని విధంగా వేరే అంతస్తులో లిఫ్ట్ ఆగింది. అందులోనుంచి వరండాలోనికి రాగానే సరిగ్గా అక్కడే ఆ 'దీప స్తంభాన్ని' చూశాను.

ఎరుపు తెలుపు చారలతో ఎంతో ఠీవిగా బీచ్ ఒడ్డున నిలబడి వెలుగులు విరజిమ్ముతోంది. నావికులకు దారి చూపటమే కాకుండా నాలాగా గతి తప్పిన వంటరి రోగులకు కూడా తీరాన్ని తెలిపే దీపంలా తోచింది.

నన్ను నేను ఆ దీప స్తంభానికి ఆసరాగా చేసుకుని, రాత్రి చీకట్లు ముసిరేవరకూ - చలిగాలి వరండా అంతా నిండే వరకూ అక్కడే ఆ కుర్చీలో దుప్పట్ల అడుగున ఉండేవాడిని, నా చీకటి బ్రతుక్కి - ఆ లైట్‌హౌస్ దారి చూపేది. నన్ను తన కాంతి రేఖలతో దిగంతాలకు తీసుకుపోయేది!

## వింత రోగులు:

ఈ వరండాలలో తిరుగుతూనే, ఆసుపత్రి రోగులను తెలుసుకున్నాను. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత క్షయవ్యాధి గ్రస్తులకు రక్షణ కల్పించి తర్వాత పిల్లల సంక్షేమం కోసం సేవలందించి - యిప్పుడు వింత రోగులకు నిలయమై నిలిచింది - ఈ మారిటైం ఆసుపత్రి.

ఒకచోట దొందవొళ్ళ రోగులు

కదల్లేక ఆశగా వైద్యులు తమ వొళ్ళు తగ్గిస్తారని చూస్తుంటారు ఒకచోట - కాళ్ళూ చేతులూ తెగిన వాళ్ళు ప్రమాదాల సంఖ్యను గుర్తు చేస్తుంటారు. అన్ని రకాల భంగిమల్లో శీలలు వేసి బిగించిన అవయవాలతో అవస్థ పడుతుంటారు!

ఇక మా కోసం - ఒక మూల చోటు కావాలి కదా! రెక్కలు తెగిన పక్షులం - పలుకలేని చిలుకలం! ఒక వరండా చివర - ఎవరికీ అడ్డు రాకుండా, మిగతా ''అదృష్టవంతులైన'' రోగులకు దూరంగా, మా గూడు.

రోగులందరకూ 'జిమ్' కూడా వుంది. అదొక మాయాలోకం! మోటార్‌సైకిల్ ప్రమాదంలో ఎముకలన్నీ తునాతునకలైన కుర్రవాడు, నిచ్చెన పైనుంచి పడి కాళ్ళు విరిగిన ముసలమ్మ - రైలుకింద పడి కాలు తెగిన నడివయస్కుడూ, వరసగా వ్యాయామం చేస్తుంటారు. చేతులు కాళ్ళూ - ఆడిస్తూ మోతలు చేస్తుంటారు! నన్ను కూడా అరగంట ఏటవాలుగా వేలాడదీస్తారు! ఈ తతంగం తర్వాత చక్రాల కుర్చీలో నా 119 గదిలో వదిలి - వార్డ్ బోయ్ - 'బోన్ అపిటైట్' అని చెప్పి వెళ్ళిపోతాడు!

''బోన్ అపిటైట్''! ఆహా! భోజనం చేసి ఎంత కాలం అయింది! కాస్త నిమ్మనీళ్ల చుక్కలు తప్ప - ఏమీ గొంతు జారిన గుర్తు లేదు!''

అన్నీ గొట్టాలు, సూదుల ద్వారానే కావలసిన శక్తి దేహంలోనికి వెళ్తోంది.

కాని నా ఆనందం కోసం - నా మూడ్‌ని బట్టి - నాకిష్టమయిన పదార్థాలు - రొయ్యల వేపుడు, వైట్ వైన్, బాయిల్డ్ ఎగ్, సన్నగా తరిగి అన్ని సరిగ్గా వుండాలి కదా - టోస్ట్ చేసి, మంచి సాస్ వేసి, ఎదురుగా పాత్రల నిండా పెట్టుకుని ఆరగిస్తాను! అబ్బ లాంటి ఏంచు! కాని ఇప్పుడు అజీర్తి అన్న సమస్య లేదు కదా!

## రెప్పపాటు భాష:

పగలే నా అక్షర దేవత 'సాండ్రిని' వస్తుంది. మధ్యాహ్నా సమయంలో ఈ ప్రపంచానికీ నాకూ గల ఒక్క సంబంధం - నా ఎడమ కనురెప్ప కదా! ఆ రెప్పపాటుతోనే నాకీ అక్షర దేవత - ఎలా 'మాట్లాడాలో' కోడ్ చేసి నేర్పింది.

''నీవు అక్షరాలు చదువుతూ వుండు! నేను రెప్పపాటుతో ఎక్కడ ఏ అక్షరమో తెలియజేస్తాను''. ఈ విధంగా ఒక మాట - ఒక వాక్యం ఏర్పడుతుంది. ముందుగా నా భావాల్ని ప్రోదిచేసి, వాక్యాల్ని కూర్చుకుని, పదాలుగా విడగొట్టి, అక్షరాలుగా దర్శించి - అప్పుడు ఒక్కొక్క రెప్పపాటుతో అక్షరాలను మాలగా చేర్చి, పదాలు వాక్యాలుగా గుదిగుచ్చి - నా గుండె గోడును తెలియ చెప్పుకుంటున్నాను.

ఇది ఎంత ఓర్పు - శ్రమ - సమయం పడుతుందో - నా గోడంతా అక్షర రూపంలో రావటానికి, నా సెక్రటరీ 'క్లాడీ'కి ఎంత నేర్పు ఓర్పు కావాలో - ఎలా వర్ణించను? ఆమె నవ్వుతూ - ఎప్పుడూ విసుగు దగ్గరకు రానీయకుండా ఎంతో సమయస్ఫూర్తితో వ్యవహరించేది - ఆమెకు ఏవిధంగా కృతజ్ఞతలు తెలుపగలను?

నా మనసు తూనీగలాగా ఎగురుతోంది. సీతాకోక చిలుకలా తేలిపోతూంటుంది. అంతరిక్షంలో - కాలంతో - ఎటు కావాలంటే అటు ఎగిసిపడుతుంది.

నాకిష్టమైన ప్రదేశాల్ని - నేను ప్రేమించిన అమ్మాయిని - నా చిన్న నాటి కలల్ని - నా యౌవ్వనపు ఆశల్ని, అన్నింటిని సాఫల్యం చేసుకోగలుగుతున్నాను. ఇలా తిరిగి తిరిగి అలసిపోతాను. కాని ఈ పడక యాత్రల్ని గ్రంథస్తం చెయ్యాలి కదా!

## శబ్దాలు:

నామెడ కొద్దిగా త్రిప్పగలుగుతున్నాను. అంటే నా దృష్టి తీరాలు పెరిగాయన్న మాట! ఇప్పుడు పై వరండాలో నుంచి - బీచ్, సముద్ర జలాలు, రంగు రంగుల గొడుగులు - బీచ్‌లో పరుగులు తీసే చిన్నారుల్ని చూడగలుగుతున్నాను! కాని ఈ ఆనందం ఎక్కువ కాలం నిలవలేదు.

ఒకరోజు కంటి వైద్యుడు వచ్చి - నా కుడిరెప్ప - ఎప్పుడూ తెరిచే వుంటుందని, దానివల్ల కనుగ్రుడ్డు చెడిపోతుందని చెప్పి - రెప్పను మూసి కుట్లు వేశాడు - పైగా - ''ఆర్నెల్లే కదా'' అన్నాడు. దేనికి ఆరు నెలలు? అతను మేజోళ్లు కుడుతున్నట్లు నాకుడి రెప్ప మూసి కుడుతుంటే అర్థం లేని

భయంతో లోలోపల ఉడికిపోయాను! పొరపాటున, నా ఎడమ రెప్ప మూసివేస్తే - నా గతి ఏమిటి? అని ఆందోళన ఆవహించింది! ఈ ప్రపంచానికి నాకూ మధ్య తెరిచి వున్న చిన్న కిటికీ అదే కదా!

ఆ తర్వాత శబ్దాల హోరు - దూరంగా బీచ్‌పైన విమానం ఎగురుతుంటే ప్రక్కనే - ఏదో మిల్లు ఆడుతున్నట్లు - కిటికీలో నుంచి ఏదో కీటకం గదిలోనికి వచ్చి శబ్దం చేస్తుంటే - అది వంద రెట్లు పెరిగి చెవులు బ్రద్దలయినట్లు - వరండాలో బూట్ల చప్పుడు - అర్థం లేకుండా మోగుతుంటే - అబ్బ ఎంత భయంకరమైనవి - భరించలేని మోతలు -

ఈ గోలకు దూరంగా, నాలో నిశ్శబ్దం! రంగు రంగుల సీతాకోక చిలుకల రెక్కల చప్పుడు వినిపిస్తుంది!

ఆ రెక్కల చప్పుడు వినాలంటే - ఎంతో శ్రద్ధగా ఆలకించాలి! గట్టిగా ఊపిరి పీలిస్తే - ఆ రెక్కల చప్పుడు అందులో కలిసిపోతుంది. నేను గాలి పీలవలేను కదా! అందుకే ఆ మృదువైన అరుదైన రెక్కల సవ్వడి వినగలుగుతున్నాను!

**చిన్నారి దేవత:**

ఇక రాత్రయింది. చీకటి అలుముకుంటోంది. చలి ముసురుకుంటున్నది. ''లైట్ హౌస్'' నమ్మకంగా - కాంతి వెదజల్లుతోంది!

ప్రపంచంలో - నాకు తెలిసిన వాళ్లు నాకు మేలు జరగాలని నా ఆరోగ్యం కోసం ప్రార్థించే వేళయింది!

'కామరూన్'లో ఆఫ్రికా దేవతలు నాకు స్వస్థతని చేకూర్చాలని ఒక అభిమాని ప్రార్థిస్తున్నాడు. 'బోరెక్స్'లో మా అత్తగారు - మేరిమాతను వేడుకుంటోంది. కాని ఇంత పెద్ద రక్షక కుడ్యాలు నా చిట్టి తల్లి సెలిస్టీ ప్రార్థనతో పోలిస్తే - ఇసుక గోడలై పోతాయి! తన చిన్నారి కన్నులు మూసి తనకు తెలియని దేవుణ్ణి, నాకు మేలు చెయ్యాలని అడుగుతూ నిద్రలోకి జారుకుంటుంది! సరిగ్గా అదే సమయానికి నాకూ 'నిద్ర' పడుతుంది! నా రెప్పచాటు లోకంలో - నా సుషుప్తి సామ్రాజ్యంలో - నా చిన్నారి పంపిన దేవత నన్ను కాపాడుతూ వెన్నంటే వుంటుంది!

ఈ విశ్వాంతరాళంలో అంతర్లీనంగా ఎక్కడైనా, ఈ ఖైదు నుంచి నన్ను విముక్తుణ్ణి చేసే తాళం చెవి దాగివుందా?

నాకు 'స్వేచ్ఛ'ను కౌగలిగిన విలువైన 'కరెన్సీ' ఎక్కడైనా లభిస్తుందా? వెతుకుదాం!!

**చివరి మాట:**

డొమినిక్ బాబి పుస్తకం వారం రోజుల్లో 25,000 కాపీలు అమ్ముడు పోయింది. అంతేకాక, తర్వాత తనలాంటి రెక్కలు తెగిన పక్షుల కోసం ఒక సంఘం పెట్టాడు! ఇతని స్థితిని, కథను ఒక డైరెక్టర్ ఫిలిం కూడా తీసాడు! 1997 మార్చి 9వ కదపగలిగిన ఆ ఒక్క కనురెప్ప కూడా మూసుకున్నాడు శాశ్వతంగా!

ఆ రోజు ఫ్రెంచ్ టెలివిజన్‌లో ఆ ఫిలిం ప్రసారం చేశారు, ఆయనకు నివాళిగా....

# చార్లెస్ డార్విన్ - కారల్ మార్క్స్

- టి. రవిచంద్

"Marx and Darwin were the two most revolutionary and influential thinkers of the nineteenth century..." - FRANCIS WHEEN

''డార్విన్ ఎలా సజీవ ప్రకృతి యొక్క అభివృద్ధి నియమాన్ని ఆవిష్కరించినాడో, అలాగే మార్క్స్ మానవ చరిత్ర యొక్క అభివృద్ధి నియమాన్ని ఆవిష్కరించినాడు'' అని మార్క్స్ ప్రియ మిత్రుడు ఫ్రెడరిక్ ఎంగెల్స్ కారల్ మార్క్స్ సమాధి వద్ద చేసిన ఉపన్యాసంలో అన్నాడు. మార్క్స్ దృష్టిలో శాస్త్ర విజ్ఞానానికి చాల ప్రాముఖ్యత ఉంది. దీన్ని ఆయన ఒక క్రియాశీల విప్లవ శక్తిగా గుర్తించాడు. శాస్త్ర విజ్ఞానాన్ని క్రియాశీల విప్లవ శక్తిగా గుర్తించాడు కాబట్టే కారల్ మార్క్స్ తన కాలంనాటి విజ్ఞాన శాస్త్ర ఆవిష్కరణలను, ప్రయోగాలను ఎంతో ఆసక్తితో అధ్యయనం చేసేవాడు. ప్రపంచానికి పందొమ్మిదవ శతాబ్దం అందించిన ఇద్దరు మహా పురుషులు చార్లెస్ డార్విన్ (1809 - 1882), కారల్ మార్క్స్ (1818 - 1883). జీవ శాస్త్రంలో డార్విన్ పరిణామ వాదం ఎలా విప్లవాత్మక పరిణామాలకు దోహదకారి అయిందో, అలాగే అర్థ శాస్త్రంలో మార్క్స్ ఆలోచనలు విప్లవాత్మక మలుపు. యావత్ మానవ జాతంతా ఒకే పూర్వీకుల నుంచి ఆవిర్భవించిందనీ, అవతరించిదనీ 1859వ సంవత్సరంలో ప్రఖ్యాత జీవ శాస్త్రజ్ఞుడైన డార్విన్ ప్రపంచ ప్రసిద్ధి చెందిన తన మహా గ్రంథం ''ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్'' (జీవ జాతుల పుట్టుక) లో ప్రకటించాడు. ఈ జీవ సృష్టికి, ఈ జీవ పరిణామానికి ఏదో అతీత శక్తో, ఏ దేవుడో కారణం కాదని, కొన్ని లక్షల కోట్ల సంవత్సరాల సుదీర్ఘ పరిణామమే కారణమని డార్విన్ అపారమైన, అసాధారణమైన తన పరిశోధనల ద్వారా నిరూపించాడు. పెట్టుబడి దారీ ఉత్పత్తి క్రమాన్ని, దాని లక్ష్యమైన అదనపు విలువ సృష్టిని గుర్తించి, అదనపు విలువే ఆ సమాజపు సాధారణ ఆర్థిక నియమంగా ప్రకటించిన మహా గ్రంథం ''కాపిటల్'' (పెట్టుబడి). ఇది తొలిసారి 1867వ సంవత్సరంలో జర్మనీ భాషలో ప్రచురించ బడింది. ప్రపంచ మానవాళిపై ఈ రెండు గ్రంథాలు కలిగించిన ప్రభావాన్ని అంచనా వేయటం అంత తేలికయిన పనికాదు. సమకాలికులైన అటువంటి ఇద్దరు మహనీయులు ఒకరి కృషిపై మరొకరు ఎటువంటి అభిప్రాయం కలిగి ఉన్నారో తెలుసుకోవటం ఆసక్తి కరమైన విషయం.

జీవ శాస్త్రజ్ఞుడైన డార్విన్, అర్థ శాస్త్రజ్ఞుడైన మార్క్స్ జీవితాల మధ్య ఆసక్తికరమైన పోలికలున్నాయి. వీరిద్దరు సమకాలికులు. డార్విన్ 1809వ సంవత్సరంలో జన్మించి 1882వ సంవత్సరంలో మరణించాడు. మార్క్స్ 1818వ సంవత్సరంలో జన్మించి 1883లో చనిపోయాడు. వీరిద్దరి భౌతిక రూపాలు గంభీరమైనవి. నైతిక స్వభావంలో ఇద్దరూ విశిష్టమైనవారు. వీరు కనుగొన్న సిద్ధాంతాల వల్ల ఇరువురినీ ద్వేషించేవారు అనేకమంది ఉన్నా, వీరిద్దరికి వ్యక్తి గత శత్రువు ఒక్కరు కూడా లేరంటే ఆశ్చర్యం కలగక మానదు. సత్యాన్వేషణలో, సత్యనిరతిలో ఒకరిని మించిన వారు మరొకరు. అసాధారణమైన అధ్యయనం, పరిశోధనలతో రచనలు చేసి, సమకాలిక సమాజాన్ని ప్రభావితం చేయడమే కాకుండా, భవిష్యత్తు తరాలు విజ్ఞాన శాస్త్ర రంగంలో, సామాజిక శాస్త్ర రంగాలలో చేసే పరిశోధనలకు, ప్రయోగాలకు మార్గ దర్శకులయ్యారు. వీరిద్దరి సిద్ధాంతాలు ఆధునిక ప్రపంచంలో ఎన్ని విప్లవాత్మక పరిణామాలకు దారితీశాయో, అన్ని విమర్శలకు గురయ్యాయి. మార్క్స్ జర్మనీలో పుట్టినా, ఆయన మేధాకృషి అంతా ఇంగ్లాండులోనే జరిగింది,

టి. రవిచంద్, గుంటూరు, ప్రముఖ పాత్రికేయుడు, మిళింద పబ్లికేషన్స్ అధినేత

అక్కడే ఆయన తుది శ్వాస విడిచాడు. డార్విన్ ఇంగ్లాండ్‌లో పుట్టి, అక్కడే పరిశోధనలు చేశాడు. మార్క్స్ అర్థ శాస్త్రంలోనే ప్రత్యేక పరిశోధన జరిపినా, ఇతర శాస్త్ర రంగాలలోని పరిణామాలపై అమితమైన ఆసక్తిని, శ్రద్ధను కనబరిచేవాడు. మానవ సంబంధమయినదేదీ ఆయనకు పరాయిదికాదు. మార్క్స్, ఎంగెల్స్‌ల మిత్రుడు విల్ హెల్మ్ లీబ్‌క్నెష్ట్ మార్క్స్ గురించి రాసిన స్మృతుల్లో ఆయన గురించి ఇలా రాశాడు ''ఆయన (మార్క్స్) విశ్వవ్యాపక మేధయొక్క, విశ్వాన్ని ఆవరించి, విలువగల ప్రతి వివరంలోకి దూరి, దేనినీ అముఖ్యమనిగానీ, తృణప్రాయమని గానీ నీచంగా చూడని మేధయొక్క బహుముఖత్వం, సర్వం కషత్వం అని కూడా అంటాను - అది ఉన్న చోట, ఆ అధ్యాపనం, బహుముఖంగా ఉండక తప్పదు. డార్విన్ పరిశోధనల యొక్క ప్రాముఖ్యాన్ని గ్రహించిన మొదటి వాళ్ళలో మార్క్స్ ఒకడు.'' తన కాలం నాటి పెట్టుబడిదారీ సమాజపు శ్రమదోపిడీ విధానాన్ని బహిర్గతం చేయటం ద్వారా మార్క్స్ పెట్టుబడి దారుల, పాలక వర్గాల ఆగ్రహాన్ని చవిచూడవలసి వచ్చింది. స్వార్థపరుల, అధికారవర్గాల దుష్ప్రచారానికి గురయిన ప్రపంచం, మార్క్స్ సత్యనిరతని గుర్తించలేక పోయింది. ఆయన సిద్ధాంతాల్ని, వ్యక్తిత్వాన్ని మానవాళికే వ్యతిరేకంగా భావించి ప్రచారం చేశాయి. డార్విన్ జీవ శాస్త్రానికే పరిమితమయి కృషి చేసినా, ఆయన యుగ కర్తృత్వాన్ని గుర్తించిన వాళ్ళలో కారల్ మార్క్స్ ప్రథముడు. డార్విన్ జీవశాస్త్రానికి, అంతకంటే విస్తృతార్థంలో మాట్లాడితే ఆయన విజ్ఞాన శాస్త్రానికి మాత్రమే అంకితమయినవాడు. మార్క్స్ దృష్టి విశ్వవ్యాపకమైనది. విజ్ఞాన శాస్త్రంలోని అన్ని శాఖలలో ఆయనకు ప్రత్యేకమైన ఆసక్తి. యూరప్‌లోని ఏడెనిమిది భాషా, సాహిత్యాలలో ఆయన పండితుడు. ఎడ్వర్డు ఎవెలింగ్ మాటల్లో చెప్పాలంటే వీటన్నిటిలో మార్క్స్ ''మాస్టర్''. అంతేకాదు, ఆయన మూర్తీభవించిన కళాభిమాని. ఆయన కళ (ఆర్ట్) లోని అన్ని ప్రక్రియల్ని, రూపాల్ని అభిమానించడమే కాదు వాటిలో మంచి పరిజ్ఞానం, ప్రవేశం కూడా సంపాదించాడు. పాల్ లాఫార్గ్ అన్నట్టు ''మార్క్స్ అన్నింటా అసలైన మనిషి, అలాంటి వాణ్ణి మళ్ళీ చూడబోను'' (ఇదిషేక్‌స్పియర్ 'హామ్లెట్' నాటకంలో అన్నమాటలు). ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన నిజమైన మనిషి.

చార్లెస్ డార్విన్, కారల్ మార్క్స్ జీవితాల్లో పేర్కొనదగిన గొప్ప సంఘటన ఒకటి ఉంది. జీవ శాస్త్రంలో డార్విన్ కనుగొన్న ప్రకృతి వరణ సిద్ధాంతం (Natural Selection) సామాజిక శాస్త్రంలో మార్క్స్ కనుగొన్న భౌతిక వాద గతితర్కం (Materialistic Dialectics) లాంటి సిద్ధాంతాన్ని వీరిద్దరి సమకాలికులు ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలేస్ (1823-1913), యోసెఫ్ డీట్స్‌గెన్ (1828-1888)లు కనుగొన్నారు. ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలేస్ అనే తూర్పు ఇండీస్ ప్రకృతి శాస్త్రవేత్త 1830వ సంవత్సరంలో డార్విన్ రెండు దశాబ్దాలు దేన్నయితే విశేష పరిశోధన, పరిశీలన చేసి కనుగొన్నాడో, అదే సిద్ధాంతాన్ని కేవలం ''మెరుపులా మెరిసిన ఒక ఆలోచన''తో కనుగొన్న వాలేస్ పేరుతో ప్రపంచం గుర్తించడానికే వదిలి పెట్టాడు డార్విన్, అదీ ఆయన వైజ్ఞానిక నిజాయితీ. కానీ చివరకు ఇద్దరి మిత్రులు రెండు సిద్ధాంత పత్రాల్ని ఉన్నత స్థాయి బ్రిటిషు శాస్త్రజ్ఞుల సంఘానికి పంపారు. అంతిమ విజయం డార్విన్‌నే వరించింది. నూతన సిద్ధాంత ప్రతిపాదనలో డార్విన్ అసామాన్యమైన పరిశోధనలు జరిపాడు. ఎంతో కష్టపడ్డాడు. తన ప్రతిపాదన, సూత్రీకరణ సర్వ సమగ్రంగా ఉండే విధంగా డార్విన్ ప్రయత్నించాడు. డార్విన్, వాలేస్ సిద్ధాంత పత్రాలు ''జర్నల్ ఆఫ్ లిన్నేయన్ సొసైటీ'' (1858)లో ప్రచురించబడ్డాయి. మొత్తం ఈ సంఘటనలో డార్విన్ ప్రవర్తన చాలా ఉన్నతంగా, ఉదాత్తంగా ఉంది. తన మిత్రుల పలుకుబడితో వాలేస్ కృషిని నామ రూపాల్లేకుండా చేయవచ్చు. ఏదో గొడవ సృష్టించి దుష్ప్రచారం చేయవచ్చు. ఆయన అలా చేయకుండా

వాలేస్ కృషిని నిజాయితీగా గుర్తించాడు. అంత సత్య నిరతి కలవాడు కనుకనే శాస్త్ర ప్రపంచం అంతిమంగా డార్విన్‌నే గుర్తించింది. తత్ఫలితంగా 1859 నవంబరు 24వ తేదీన ''ప్రపంచాన్ని మార్చి వేసిన పుస్తకం'' ది ఆరిజన్ ఆఫ్ స్పీషీస్ ప్రచురింపబడింది.

అలాగే కారల్ మార్క్స్ సమకాలికుడు, జర్మన్ చర్మకారికుడు యోసెఫ్ డీట్స్‌గెన్ (1828-1888) మార్క్స్‌తో సంబంధ లేకుండా స్వతంత్రంగా గతితార్కిక భౌతిక వాదాన్ని కనుగొన్నాడు. కార్మిక వర్గంలో పుట్టి స్వయం కృషితో చదువుకొని ''మానవ మేధో కృషి స్వభావం'' (The Nature of The Workings of The Human Mind)అనే తాత్విక గ్రంథ రచన చేసి మార్క్స్, ఎంగెల్స్‌ల ప్రశంసలు పొందగలిగాడు. ఇదే విషయాన్ని గురించి చెబుతూ ఎంగెల్స్ ఒక చోట ఇలా అంటాడు ''ఈ భౌతికవాద గతితర్కం అనేక సంవత్సరాలపాటు మా అత్యుత్తమైన పనిముట్టుగా, అతి నిశితమైన ఆయుధంగా ఉపయోగపడుతున్నది. ఇలాంటి భౌతికవాద గతితర్కం, మాతోనూ, హెగెల్‌తోనూ సంబంధం లేకుండా ఒక జర్మన్ కార్మికుని చేత కూడా కనుగొన బడ్డది.'' కారల్ మార్క్స్, కూగెల్‌మన్‌కు రాసిన ఒక లేఖ (డిసెంబర్, 5, 1868)లో స్వతంత్రంగా గతితార్కిక భౌతిక వాదాన్ని చేరుకున్న డీట్స్‌గెన్‌ను, ఆయన కృషిని ''అత్యుత్తమైనదిగా, శ్లాఘ్యతరమైనది''గా పేర్కొంటాడు. మార్క్స్ గురించి పాల్ లాఫార్గ్ అన్న మాటలు ఎంతయినా వాస్తవమని పై మాటలు నిరూపిస్తున్నాయి. ''నేను చారిత్రక న్యాయం చేకూరుస్తాను, ఎవరికి ఇవ్వవలసింది వాళ్ళకు ఇస్తాన''ని మార్క్స్ తన మిత్రులతో అన్న మాటలు ఎంత చిత్త శుద్ధితో అన్నవో కార్మిక వర్గ తత్వవేత్త డీట్స్‌గెన్ విషయంలోనే రుజువయ్యాయి. ఎంత అనామకుడైనా, అప్రసిద్ధుడైనా ఒక భావాన్ని మొట్టమొదట వ్యక్తంచేసిన రచయితను కానీ పరిశోధకుడిని కానీ మార్క్స్ గుర్తించడంలోనే మానవ సమాజ చరిత్రలో వ్యక్తికున్న స్థానానికి ఆయన ఎంత ప్రాధాన్యత నిచ్చింది తెలుపుతుంది. మార్క్స్ జీవితంలోని మానవతా పూరితమైన ఇటువంటి అంశాల్ని విస్మరించి, ఆయన సిద్ధాంతాల్ని ఆర్థిక నియతివాదంగా దిగజార్చి, మత రూపంలో ఆయన్ని అర్థం చేసుకొని మార్క్సిస్టు నామధారులు, మార్క్సిస్టు వ్యతిరేకులు ఆయన జీవితానికి, సిద్ధాంతానికి చాలా అపకారం చేశారు. ఈ మధ్య భారతదేశం సందర్శించిన ప్రపంచ ప్రసిద్ధ భాషా శాస్త్రజ్ఞుడు, స్వతంత్ర చింతనాపరుడు, రాజకీయ విశ్లేషకుడైన నోమ్ చోమ్‌స్కీ మార్క్సిజం గురించి ఆలోచనాత్మకమైన విశ్లేషణ చేశారు. ఇటువంటి విశ్లేషణను గతంలో మార్క్సిస్టు మానవతా వాదాన్ని వెలుగులోకి తెచ్చిన సుప్రసిద్ధ మనో విజ్ఞాన శాస్త్రజ్ఞుడు ఎరిక్‌ఫ్రామ్ కూడా చేసాడు. కేరళలోని తిరువనంతపురంలో ఇ.ఎమ్.ఎస్. ఎకాడమిలో ప్రసంగిస్తూ నోమ్‌చోమ్‌స్కీ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని విశ్లేషించారు ''సోవియట్ యూనియన్‌కు మార్క్సిస్టు సిద్ధాంతంతో ఏ సంబంధంలేదు. లెనిన్ మార్క్సిస్టు, ట్రాట్స్కీ కాదు. ప్రజలు ఎప్పుడయితే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని మత స్వభావం లేక ధోరణితో విశ్వసించడం ప్రారంభించారో అప్పుడది కీడుగా పరిణమించింది.'' ఇటు వంటి అన్యాయం డార్విన్‌కూ జరిగింది. ఆయన మరణానంతరం ప్రచురించబడిన ''స్వీయ జీవిత చరిత్ర'' నుండి ''మత భావాలు'' అనే అధ్యాయాన్ని తొలగించి ఆయన కుటుంబ సభ్యులు ప్రచురించారు! ఆ తర్వాత మత వాదులు ఆయన భావాల్ని వక్రీకరిస్తూ వ్యతిరేక ప్రచారం చేశారు. మతాధిపతులు డార్విన్‌ను క్రైస్తవానికి వ్యతిరేకిగా చిత్రించడానికి ప్రయత్నిస్తే, కుటుంబ సభ్యులేమో ఆస్తికుడిగా చూపించడానికి ప్రయత్నించారు. నిజానికి ఆయన ఏ మత విశ్వాసంలేని నాస్తికుడు. కాని నాస్తికుడిగా క్రైస్తవ మతాన్ని కానీ ఏ మత విశ్వాసాన్ని కానీ ప్రత్యక్షంగా ఎదుర్కొనడానికి డార్విన్ ఇష్టపడలేదు. స్వేచ్ఛా చింతనను ప్రభోదించటం ద్వారా ప్రజల మనస్సుల్ని వికసింప చేయవచ్చునని,

తాను విజ్ఞాన శాస్త్రానికే పరిమితమయ్యానని ఆయన ఎడ్వర్డ్ ఎవలింగ్‌కు రాసిన లేఖలో స్పష్టం చేశాడు. కుటుంబ కారణాల దృష్ట్యా, తన స్వభావంరీత్యా మత వ్యతిరేక భావాల్ని బహిరంగంగా ప్రకటించుకోవడానికి ప్రయత్నించలేదు. ఒక సైంటిస్టుగా విజ్ఞాన శాస్త్రంలో నిజాయితీగా కృషి చేస్తే సమస్త మూఢ విశ్వాసాలు వాటంతటవే పోతాయని డార్విన్ భావించాడు. విజ్ఞాన శాస్త్ర వేత్తగా ఆయన చిత్త శుద్ధితో కృషి చేసి మానవాళిని ప్రభావితం చేశాడు. ఇలా డార్విన్, మార్క్స్‌లు తాము ఏరంగాల్లో కృషి చేస్తున్నారో, ఆయా రంగాల్లో తమకు సమకాలికంగా ఇతరులు చేస్తున్న కృషిని కూడా మనస్ఫూర్తిగా ప్రశంసించటమే కాకుండా, వాళ్ళకు రావాల్సిన సముచిత స్థానం వారికి దక్కేట్టు చూశారు. వీళ్ళిద్దరు తమ జీవిత కాలాల్లో అసూయను, అహంకారాన్ని దరిచేరనీయకుండా ఆదర్శవంతమైన మానవీయ జీవితాల్ని గడిపారు.

డార్విన్, మార్క్స్‌లు 19వ శతాబ్దంలోని గొప్ప విప్లవాత్మక చింతనాపరులు, అత్యంత ప్రభావ వంతమైన వ్యక్తిత్వాలు కలవారు. తమ జీవిత చరమ దశలో ఇద్దరూ ఇంగ్లండులోనే తమ పరిశోధనలు చేశారు. ఇద్దరికి ఉమ్మడిగా కొంతమంది సన్నిహిత మిత్రులుండేవారు. అటువంటి వారిలో ఎడ్విన్‌రే లాంకెస్టర్ (Edwin Ray Lankester) ముఖ్యుడు. కారల్ మార్క్స్ సమాధి వద్ద ఫ్రెడరిక్ ఎంగెల్స్ చేసిన ఉపన్యాసంలో డార్విన్, మార్క్స్‌ల ఆవిష్కరణల్ని పోల్చి ప్రసంగిస్తాడు. ఫ్రాన్సిస్ వీన్ ఈ మధ్య రాసిన కారల్ మార్క్స్ జీవిత చరిత్రలో ఈ సంఘటనను గురించి వ్యాఖ్యానిస్తూ, ఒక పరిణామవాది (Evolutionist)ని, మరొక విప్లవకారుడ్ని (Revolutionist) ఇలా పోల్చడం, మార్క్స్, డార్విన్‌ల సంయుక్త మిత్రుడైన ఎడ్విన్ లాంక్స్టర్‌కు అభ్యంతరమనిపించలేదు. ఈ పోలికను ఒకే ఒక వ్యక్తి వ్యతిరేకించేవాడు, కానీ ప్రస్తుతం ఆయన ఆపని చేసే స్థితిలో లేడు. ఆయనే కీ॥శే॥ కారల్ మార్క్స్ అంటాడు ఫ్రాన్సిస్ వీన్. ఈ మాటల్లో కొంత మందికి వ్యంగ్యోక్తి స్ఫురించవచ్చు. కాని మార్క్స్ జీవితం తెలిసిన వాళ్ళకు ''ఎల్లప్పుడూ తాను గానే ఉండటానికి'' ఇష్టపడే ఆయన స్వభావానికి ఇటు వంటి పోలిక నచ్చదని తెలుసు. ఏమయినా వీరిద్దరికి ఒకరి కృషిపై మరొకరికి గౌరవ భావం ఉండేదని వీరి సన్నిహితులకు బాగా తెలిసిన విషయం. అంతేకాదు 1873లో ''కాపిటల్'' ద్వితీయ ముద్రణ వెలువడినప్పుడు డార్విన్ నుండి మార్క్స్‌కు ఒక లేఖ వచ్చింది. ఈ లేఖలో డార్విన్ మార్క్స్ ''కాపిటల్''ను గొప్ప గ్రంథం (great work)గా ప్రశంసించాడు. మన అధ్యయనాలు భిన్నమైనా, మన మిద్దరం జ్ఞాన విస్తృతి (extension of knowledge)ని ఆశిస్తున్నామని, ఇది సుదీర్ఘ కాలంలో మానవానందానికి సహాయపడుతుందని డార్విన్ రాశాడు. మార్క్స్ సమకాలిక మిత్రులందరికీ మార్క్స్‌పై డార్విన్‌కు, డార్విన్ పై మార్క్స్‌కు గల పరస్పర గౌరవాభిమానాల సంగతి తెలుసు. వారి సమకాలికు లెవరికీ వారి పరస్పర సంబంధాలపై పెద్ద సందేహాలు, సంశయాలు లేవు.

1859లో ''ది ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్'' ప్రచురించబడిన రోజుల్లో డార్విన్ జీవశాస్త్ర ఆవిష్కరణలు చరిత్రలో వర్గ పోరాట భావనకు ఆధారంగా మార్క్స్ భావించే వాడని ఫ్రాన్సిస్ వీన్ అంటాడు. తర్వాత రోజుల్లో ఈ భావన మార్క్స్‌లో బలహీన పడిందని కూడా అంటాడు. ఏది ఏమయినా వీరిద్దరి మేధో సంబంధం చాలా బలమయిందని చెప్పవచ్చు. వాస్తవానికి మార్క్స్ - డార్విన్‌ల భాగ స్వామ్యానికి సంబంధించిన అంశం వారితోనే ముగిసి పోవాల్సింది. కానీ దాదాపు డెబ్బయి సంవత్సరాల క్రితం కనుగొన్న మరొక లేఖ అసంఖ్యాకమైన మార్క్సిస్టు పండితుల్ని, మార్క్సిస్టేతర పండితుల్ని తప్పు దారి పట్టించింది. ఈ లేఖ తేదీ 13, అక్టోబర్, 1880. ఈ లేఖ

ద్వారా బహిర్గతమయిన ప్రధానాంశం - కారల్ మార్క్స్ ఆ లేఖా రచయిత (డార్విన్)కు తన గ్రంథం అంకితమిస్తానంటే, దాన్ని ఆయన తిరస్కరించాడని! ఆ లేఖలో ఇంకా కొన్ని ముఖ్యమైన అంశాలున్నా, ఈ విషయానికి ఎక్కువ ప్రాధాన్యత లభించింది. ఎందుకంటే ఆ లేఖ డార్విన్, మార్క్స్‌కు రాసిందిగా భ్రమించి, ఈ పరిశోధకులంతా ఒక్కొక్కరు ఒక్కోవిధంగా వ్యాఖ్యానించారు. ఈ లేఖను సోవియట్ రష్యా నుండి వెలువడే ఒక వార్తా పత్రిక తొలిసారి 1931వ సంవత్సరంలో ప్రచురించింది. దీని పేరు ''అండర్ ది బేనర్ ఆఫ్ మార్క్సిజం.'' తర్వాత కాలంలో ఈ లేఖను ఆధారం చేసుకొని డార్విన్, మార్క్స్ సంబంధాలను ఎవరికి తోచిన విధంగా వారు చిత్రించారు. 'కాపిటల్' ఆంగ్లానువాదం మార్క్స్ మరణించిన మూడు సంవత్సరాలకు (1886) వెలువడింది. ఆయన జీవించి ఉన్నప్పుడు జర్మన్ మూలం మొదటి భాగం మాత్రమే ప్రచురించబడింది. మార్క్స్ మరణించిన తర్వాత ఆయన వదిలిపోయిన రాత ప్రతుల్ని క్షుణ్ణంగా పరిశీలించి, రెండు, మూడు భాగాల్ని ఆయన మిత్రుడు ఎంగెల్స్ ప్రచురించాడు. మార్క్స్ ''కాపిటల్'' ప్రథమభాగాన్ని తన మరో మిత్రుడు విల్‌హెల్మ్ ఉల్ఫ్‌కు అంకితమిచ్చాడు. 1867లో తన మిత్రుడు విల్‌హెల్మ్ ఉల్ఫ్‌కు జర్మన్ మొదటి ముద్రణను అంకితమిచ్చిన, పదమూడు సంవత్సరాలకు డార్విన్‌కు అంకితమిస్తానని మార్క్స్ లేఖ రాయడమేమిటి, దాన్ని డార్విన్ తిరస్కరించడం ఏమిటి అన్న ఆలోచన మార్క్స్ జీవిత చరిత్రకారులెవరికీ రాలేదు.

ఈ గందరగోళానికంతా ప్రధాన కారణం 1939వ సంవత్సరంలో వెలువడిన ఇసయ బెర్లిన్ రచించిన కారల్ మార్క్స్ జీవిత చరిత్ర. ఆయన బ్రిటీష్ రాజకీయ తత్వవేత్త, భావాల చరిత్ర కారుడు (Historian of Ideas). 'కాపిటల్ జర్మన్ మూలాన్నే మార్క్స్ డార్విన్‌కు అంకిత మియ్యాలను కున్నాడని, అంకితం స్వీకరించకుండా, డార్విన్ సున్నితంగా తిరస్కరించాడని వ్యాఖ్యానించడం ద్వారా ఇసయబెర్లిన్ డార్విన్ - మార్క్స్ సంబంధాల విషయంలో వివాదాస్పదమైన ఒక కొత్త అధ్యాయాన్ని తెరిచాడు. మార్క్స్‌కు డార్విన్ రాసిన లేఖగా పేర్కొనబడుతున్న రెండో లేఖ 13 అక్టోబరు 1880వ సంవత్సరంలో రాయబడింది. అప్పటికే మరొకరికి అంకితమియ్యబడిన గ్రంథాన్ని మార్క్స్ డార్విన్‌కు అంకితమిస్తానని అడగటమేమిటి? రెండో ప్రపంచ యుద్ధకాలం నుండి మార్క్స్‌పైన, డార్విన్ పైన (ఎక్కువమంది రచయితలు) రాసిన గ్రంథ కర్తలంతా "The legend of rebuffed dedication" (అంకిత తిరస్కారమనే కట్టు కథ)ను అంగీకరించిన వారే! అయితే వీరిలో కొంతమంది మొదటి భాగమని, మరి కొంతమంది ద్వితీయ భాగమని భావించారు. 1973లో డేవిడ్ మెక్‌లెల్లన్ (David Mc Lellan) రాసిన కారల్ మార్క్స్ జీవిత చరిత్రలో "Mare certainly wished to dedicate the second volume of Capital to Darwin" (కాపిటల్ ద్వితీయ భాగాన్ని మార్క్స్ నిశ్చయంగా డార్విన్‌కు అంకిత మివ్వాలని ఆశించాడు) అన్నాడు. ఈ వాదం కూడా ఇసయ బెర్లిన్ వాదన కంటే హేతుబద్ధమైనది కాదు. కాపిటల్ ద్వితీయభాగాన్ని మార్క్స్ రాసుకున్న నోట్సు, రాత ప్రతుల్ని సంకలనం చేసి ఎంగెల్స్ ప్రచురించాడు. అంతేకాదు, కాపిటల్ ద్వితీయ భాగానికి ఎంగెల్స్ రాసిన ముందు మాటలో కాపిటల్ ద్వితీయ, తృతీయ భాగాల్ని మార్క్స్ పునశ్చరణ చేస్తూ ప్రకటించినట్లుగా తన భార్యకు అంకిత మివ్వాలనుకున్నాడని తెలిపాడు. అందువల్ల మార్క్స్‌కు డార్విన్ రాసిన రెండో లేఖ పెద్ద అబద్ధంగా కనిపిస్తుంది. మార్క్స్ రాజకీయార్థ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాన్ని డార్విన్‌కు పంపితే, ఆయన తన లేఖలో ''మతం పై దాడి'' గురించి విచారించాల్సిన అవసరం ఏముంది? ఇటు వంటి

సందేహం 1967 వరకు ఎవరికీ రాలేదు. ప్రొఫెసర్ ష్లోమో అవినెరి (Shlomo Avineri) ''ఎన్ కౌంటర్'' పత్రికలో ఈ విషయాన్ని చర్చించేవరకు ఎవరికీ ఎటువంటి సందేహం కలగలేదు. ఈ లేఖ గురించి ప్రొఫెసర్ అవినెరి వ్యక్తీకరించిన సందేహం ఏడు సంవత్సరాల తర్వాత కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చదువుతున్న యువ గ్రాడ్యుయేట్ మార్గరెట్ ఫె (Margaret Fay) దృష్టి కొచ్చింది. ఆమె నిరంతరం పరిశ్రమ, పరిశోధనల వల్ల డార్విన్ మార్క్స్‌కు రాసిన రెండో లేఖగా పేర్కొన బడుతున్న దాని గురించి ఎన్నో ఆసక్తికర విషయాలు బయట పడ్డాయి.

అక్కడ జీవ శాస్త్ర గ్రంథాలయంలో మార్గరెట్ ఫె డార్విన్ జీవిత చరిత్రల్ని, ఆయన పరిణామ సిద్ధాంతాన్ని మార్క్సిస్టు దృష్టితో పరిశీలించి గ్రంథాల కోసం తిరుగుతూ, వాటిలో మునిగిపోయి, ఆయన కృషికి రాజకీయమైన ప్రాముఖ్యత బహుశ ఏమయినా ఉంటే అది నాదృష్టి నుంచి తప్పి పోయిందేమోనని పరిశీలిస్తున్న సమయంలో, దానికి బదులుగా అనుకోకుండా ఒక చిన్న గ్రంథం ''ది స్టూడెంట్స్ డార్విన్''ను ఆమె చూసింది. ఆ గ్రంథంలోని విషయం అంత ప్రత్యేకమైంది కాదు. కానీ ఆమె దృష్టిలోకి వచ్చింది మరొక ముఖ్యమైన విషయం స్టూడెంట్స్ డార్విన్ ప్రచురించబడిన సంవత్సరం 1881. ఆ గ్రంథ రచయిత ఎడ్వర్డు ఎవలింగ్. ఆయన మార్క్స్ కుమార్తె ఎలినార్ భర్త (వీన్ ప్రకారం లవర్). తన మార్క్స్ జీవిత చరిత్ర గ్రంథంలో ఎడ్వర్డు ఎవలింగ్ గురించి ఆశ్చర్యకరమైన సంగతులు ఫ్రాన్సిస్ పేర్కొన్నాడు. ఎలినార్ ఎడల ఆయన ప్రవర్తన చాలా దుర్మార్గ పూరితంగా ఉంది. స్టూడెంట్స్ డార్విన్ గ్రంథం ద్వారా బహిర్గత మయిన విషయాలు మార్గరెట్ ఫెలో ఉత్సాహాన్ని పెంచాయి. ఈ ఆధారాల వల్ల అర్ధ శతాబ్దిగా ఇసయ బెర్లిన్, డేవిడ్ మెక్‌లల్లన్ లాంటి వారిని వేధించిన సమస్యకు పరిష్కారం లభించింది.

బ్రిటన్‌లో నాస్తిక పోరాట యోధులైన అనీబిసెంట్, చార్లెస్ బ్రాడ్లాల సంపాదకత్వంలో ప్రచురించబడుతున్న "The International Library of Science and Free thought" (విజ్ఞాన శాస్త్రం, స్వేచ్ఛా చింతనల అంతర్జాతీయ గ్రంథాలయం) వారు ప్రచురించిన గ్రంథ పరంపరలో రెండో భాగం (Second Volume) ఎడ్వర్డు ఎవలింగ్ 'స్టూడెంట్స్ డార్విన్' గ్రంథం. క్రైస్తవ మతానికి, దైవ శాస్త్రానికి వ్యతిరేక వాదనలు దీనిలో ఉన్నాయి. జీవ శాస్త్ర గ్రంథాలయంలో డార్విన్, మార్క్స్ జీవిత చరిత్రల కోసం వెతుకుతుండగా తట్టిన ఆలోచన, కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయ గ్రంథాలయంలో లభించిన ఎడ్వర్డు ఎవలింగ్ డార్విన్‌కు రాసిన లేఖ (అక్టోబర్ 12, 1880)తో రూఢమైంది. ఎవలింగ్ లేఖతో పాటు స్టూడెంట్ డార్విన్ నుండి కొన్ని మాదిరి అధ్యాయాలుకూడా లభించాయి. దీనిలో స్పష్టంగా తన గ్రంథాన్ని డార్విన్‌కు అంకితమివ్వాలని భావిస్తున్నట్లుగా ఎవలింగ్ అభ్యర్థన ఉంది. అయితే ఎవలింగ్ లేఖ మార్క్స్ ఆర్కైవ్‌లోకి ఎలా చేరింది? 1895లో మార్క్స్ మిత్రుడు ఎంగెల్స్ మరణానంతరం తమ స్వాధీనంలోకి వచ్చిన మార్క్స్ లేఖలు, రాత ప్రతుల్ని ఎలినార్ మార్క్స్, ఎడ్వర్డు ఎవలింగ్‌లు సరిచూసి జాగ్రత్త పరిచారు. రెండు సంవత్సరాల తర్వాత ఎడ్వర్డు ఎవలింగ్ తన కథా నాయకులైన డార్విన్, మార్క్స్‌లను పోలుస్తూ రాసిన వ్యాసంలో 1873లో డార్విన్ తనకు రాసిన లేఖను ప్రస్తావిస్తూ, డార్విన్‌తో తాను ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినట్లు రాశాడు. ఎవలింగ్ మరో రచన ''స్టూడెంట్స్ మార్క్స్'' భారతీయ ముద్రణ 1965లో తొలిసారి వెలువడినప్పుడు, దీని అను బంధంగా చేర్చిన ''ఎడ్వర్డు ఎవలింగ్ - సంక్షిప్త జీవితం'' అనే వ్యాసంలో మహదేవ్ సాహా మరొక ఆశ్చర్య కరమైన సంగతి ప్రపంచం దృష్టికి తెచ్చాడు. ఎవలింగ్ రాసిన చిన్న పుస్తకం ''ది రెలిజియస్ వ్యూస్ ఆఫ్ డార్విన్'' (డార్విన్ మతభావాలు)లో

ఎవలింగ్ డార్విన్‌తో జరిపిన సంభాషణ ద్వారా పొందిన వ్యక్తిగత జ్ఞానంతో ఆయన క్రైస్తవ మత విశ్వాసి కాదని ఆయన నాస్తికుడని కూడా నిరూపించాడని మహదేవ్ సాహ్నె అనుబంధంలో పేర్కొన్నాడు. దీన్ని బట్టి అర్థమవుతుంది ఏమిటంటే డార్విన్‌కు ఎడ్వర్డ్ ఎవలింగ్‌కు అతి సన్నిహిత పరిచయముందని, వీరిద్దరిదీ గురు శిష్య సంబంధమని. ఆ గౌరవంతోనే ఎడ్వర్డు ఎవలింగ్ తన గ్రంథాన్ని డార్విన్‌కు అంకితమివ్వాలనుకున్నాడు. ఈ విషయంలో మార్క్స్‌కు ఎటువంటి సంబంధంలేదు. ఎడ్వర్డు ఎవలింగ్‌కు డార్విన్, మార్క్స్‌లు రెండు కళ్ళు లాంటి వాళ్ళు. మార్క్సిస్టుల్లో డార్విన్, మార్క్స్‌లపై ఇటువంటి గౌరవ భావం ఉన్న వాళ్ళు చాలా మంది ఉన్నారు. అటువంటి వారిలో కారల్ కాట్స్కీ ఒకరు. ఎడ్వర్డు ఎవలింగ్ డార్విన్‌తో జరిపిన ఉత్తర, ప్రత్యుత్తరాలు మార్క్స్ ఆర్కైవ్‌లోకి చేరడంతో ఈ గందరగోళం ఏర్పడింది. డార్విన్‌కు మార్క్స్‌కు, ఎవలింగ్ రాసిన రెండు ముఖ్యమైన లేఖల్లో వారి పేర్లను ప్రస్తావిస్తూ రాయలేదు. ''డియర్ సర్'' అనే సంబోధన మాత్రమే రెండు లేఖల్లో కనిపిస్తుంది. ఎవలింగ్ డార్విన్, మార్క్స్‌లను పోలుస్తూ రాసిన వ్యాసం పూర్తయిన తర్వాత, తన పరిశోధనా సామగ్రినంతా ఒక ఫోల్డరులో పెట్టి, మార్క్స్ రాతప్రతుల్లో ఉంచుతాడు. అలా చేయడం వల్ల ఎవలింగ్ తనకు తెలియకుండానే, డార్విన్, మార్క్స్ సంబంధాన్ని గురించి రకరకాల ఊహాగానాలకు అవకాశమిచ్చాడు. ఈ మధ్య కాలం వరకు మార్క్స్ తన 'కాపిటల్' గ్రంథాన్ని డార్విన్‌కు అంకితమిస్తానంటే తిరస్కరించినట్టు అందరు రాస్తున్నారు. అటువంటి వారిలో బ్రిటిష్ చరిత్రకారుడు పాల్ జాన్సన్ ఒకరు. ఇదంతా ఒక పెద్ద కట్టుకథ అని కారల్ మార్క్స్ జీవితాన్ని విమర్శనాత్మకంగా విశ్లేషించి జీవిత చరిత్రను 1999లో రచించిన ఫ్రాన్సిస్‌వీన్ వెల్లడించాడు. మార్క్స్ జీవిత చరిత్రకారులలో ఆయన్ని ఒక విప్లవకారుడిగా, ఒక పూర్ణ మానవుడిగా చిత్రించిన వారిలో ఫ్రాన్సిస్‌వీన్ ఒకరు. ఆయన మార్క్స్ జీవితంలోని అనేక ఘటనల్ని శాస్త్రీయంగా విశ్లేషించడానికి ప్రయత్నించారు. వీటిలో కొన్ని ఘటనల్ని మనం ఆమోదించ లేకపోవచ్చు. కాని ఆయనకు దురుద్దేశాలు అంటగట్టాల్సిన పనిలేదు. ఒక జీవిత చరిత్రకారుడిగా ఆయన నిష్పాక్షిక పరిశోధనకు అంకితమయినట్టు డార్విన్ - మార్క్స్ జీవితాలకు సంబంధించి ఒక ముఖ్యమైన ఘట్టాన్ని వివరించడంలోనే ప్రస్ఫుటమయింది. ఈ గ్రంథ సమీక్షకులు మాత్రం తమ సమీక్షలలో ఈ ఘటనకు ఇవ్వాల్సిన ప్రాముఖ్యత ఇవ్వలేదనిపిస్తుంది. మార్క్స్, హెలెన్ దెముత్ (మార్క్స్ కుటుంబంలో సహాయకురాలు) ల లైంగిక సంబంధానికే విశేష ప్రాధాన్యత నిచ్చినట్టు కనిపిస్తుంది. మార్క్సిస్టు వ్యతిరేకులు, నాజీలు ''ఈ సంఘటన''ను మార్క్స్ వ్యక్తిత్వాన్ని కించపరచడానికి బాగా ఉపయోగించుకున్నారు. ప్రొఫెసర్ టెరెల్ కార్వెర్ లాంటివాళ్ళు మార్క్స్, హెలెన్‌దెముత్‌ల అక్రమ సంబంధాన్ని బయటపెట్టిన లేఖగా భావిస్తునది - ''లెటర్ ఆఫ్ ఫోర్జరీ'' (కపట లేఖ)గా తిరస్కరించారు. ఈ విషయాన్ని నిజాయితీగా తన గ్రంథంలో ఫ్రాన్సిస్ వీన్ ప్రకటించాడు. ఈ అంశాలేవీ సమీక్షకుల దృష్టికి రాలేదు. ''మానవ స్వభావంలోని దౌర్బల్యాలను పరిగణనలోకి తీసుకోకుండా'' ప్రతి సంఘటనను మహా నీతి శాస్త్రవేత్తలవలె నీతి, అవినీతి కోణాల నుండి చూడటానికి ప్రయత్నిస్తే ఏమహనీయుడు మనకు అర్థంకాడు. అందరు మనవలె అక్రమ మనస్తత్వం, అవినీతి స్వభావం కల వారిగా కనిపిస్తారు. మానవ జీవితానికి కుట్రలు, కుతంత్రాలతో ప్రమేయంలేని నైతికేతర (amoral) పార్శ్వం ఒకటి ఉంటుందని విమర్శకులు గుర్తించాలి. లేకపోతే అనవసరమైన విషయాలకు అతిప్రాముఖ్యతనిచ్చే ధోరణి, అవసరమైన విషయాల్ని అప్రధాన విషయాలుగా పరిగణించే ధోరణి ఏర్పడుతుంది. ఈ ధోరణి వెనుక నాకు రెండు బలమైన కారణాలు

కనిపిస్తున్నాయి. ఒకటి మనలోని సంచలనాత్మక ప్రవృత్తి; మరొకటి అనారోగ్యకర (అక్రమ) మనస్తత్వం. వీటిని సబ్లిమేట్ (శుద్ధి) చేయగలిగితే మంచి విమర్శ, ఉదాత్తమైన విశ్లేషణ వెలువడుతుంది.

సమకాలికులైన ఈ ఇద్దరు ''విక్టోరియన్ సీజస్'' (విక్టోరియా రాణి పాలనా కాలపు మహా ప్రాజ్ఞులు) మధ్య మనకు తెలిసిన బంధం లేఖా బంధమే? అది కూడా 1873లో మార్క్స్ కాపిటల్ (పెట్టుబడి) గ్రంథాన్ని అందుకొని డార్విన్ రాసిన ''లెటర్ ఆఫ్ ఎకనాలెడ్జ్‌మెంట్.'' ఈ లేఖలో డార్విన్ మార్క్స్ కాపిటల్‌ను గొప్ప గ్రంథంగా కొనియాడిన సంగతి ముందే చెప్పుకున్నాము.

## సంప్రదించిన రచనలు :

1. మార్క్స్, ఎంగెల్సు సమకాలికుల స్మృతులు - అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, 1980, పేజీ 5.
2. The Students' Marx (An introduction to the study of Karl Marx's Capital) - Edward Aveling, Academic Publishers, Calcutta, First Indian Edition, 1965, Appendix 1, PP. VI - VII.
3. ఛార్లెస్ డార్విన్ (ప్రపంచ గతిని మార్చిన శాస్త్రవేత్త) - ఆనాస్ట్రొల్, తెలుగు అనువాదం : నవత, ఓరియంట్ లాజ్మన్, హైదరాబాద్, 1995, పేజీలు 6, 10.
4. The History of Science in the Nineteenth Century (on the shoulders of Giants) - Ray Spangenburg and Diane K. Moser, Universities Press (India) Limited, Hyderabad, 1999, PP. 83 - 85.
5. లుడ్విగ్ ఫోయెర్ బాఖ్, సాంప్రదాయిక జర్మన్ తత్వశాస్త్ర పరిసమాప్తి - ఫ్రెడరిక్ ఎంగెల్స్, తెలుగు అనువాదం : ఏటుకూరు బలరామమూర్తి, ప్రగతి ప్రచురణాలయం, 1982, పేజీ 36.
6. Marx - Engels, collected works, Vol. 43, Progress Publishers, Moscow, 1981, P. 173.
7. Afghan War not a clash of civilisations : Chomsky, The Hindu, Monday, November 12, 2001.
8. Karl Marx - Francis Wheen, Fourth Estate, London, 2000, PP. 363 - 368. (ఈ పుస్తకాన్ని మాజీ రాష్ట్రపతి, ప్రఖ్యాత భారతీయ తత్వవేత్త డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ సమీప బంధువు, సంస్కృత భాషా పండితులు శ్రీ సర్వేపల్లి అనంత పద్మనాభరావు ప్రేమతో శ్రీ రావెల సోమయ్య ద్వారా బహూకరించారు. వీరిద్దరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు).
9. Capital, Volume II, Karl Marx, Progress Publishers, Moscow, 1984, Engels' Preface, P. 20.
10. Reinventing Marx - Andy Merrifield, Frontier (Weekly), Vol. 33, No.1, July 30 - August 5, 2000.
11. Karl Marx; A Life, (Book Review) - Bupinder, New Thinking Communist, Vol. 11, No. 20, 1-12-2000.

# గ్రంథ సమీక్ష అను ఓ భయప్రకటన !

-నరేష్ నున్నా

(గత సంచిక తరువాయి)

కురుక్షేత్రం ప్రారంభానికి ముందు వీరబలికి సిద్ధమైన బర్బరీకుడితో కృష్ణుడి ఏకాంత సంభాషణ ఇలా ఉంటుంది :

బర్బరీకుడు - రాజ్యం యెవరిది

శ్రీకృష్ణుడు - క్షత్రియులది

బర్బరీకుడు - రాజ్యం యెవరికి

శ్రీకృష్ణుడు - క్షత్రియులకి

బర్బరీకుడు - యీ రాజ్యానికి మేం యేమవుతాం

శ్రీకృష్ణుడు - బలిపశువులు

బర్బరీకుడు - ఈ రాజ్యం వల్ల మా కెప్పుడు సుఖం

శ్రీకృష్ణుడు - రాజ్యం మీదయినప్పుడు

బర్బరీకుడు - రాజ్యం మాదెప్పుడవుతుంది

శ్రీకృష్ణుడు - క్షత్రియులు మరణించినప్పుడు

బర్బరీకుడు - క్షత్రియులు యెట్లా మరణిస్తారు

శ్రీ కృష్ణుడు - మీరు చంపినప్పుడు

బర్బరీకుడు - ఆ రోజెప్పుడు

శ్రీకృష్ణుడు - తెలీదు

బర్బరీకుడు - నా తండ్రి భీమసేనుడు కనుక నేను క్షత్రియుడిని కానా

శ్రీకృష్ణుడు - అది భీమసేనుడి మగతనాన్ని తెలుపుతుంది గాని నీ కులాన్ని కాదు

బర్బరీకుడు - వీరహనుమాను కూడా నా వలె మూలవాసే కదా అతడికెందుకు మరి పతాక మర్యాద

శ్రీకృష్ణుడు - అతను క్షత్రియుల బంటు

బర్బరీకుడు - నన్నెందుకు బలి యిస్తున్నారు

శ్రీకృష్ణుడు - ఈ యుద్ధ వేదిక క్షత్రియ పరాక్రమ ప్రదర్శన కోసమే గాని నీలాంటి వారికి కాదు. ఆ గెలుపోటముల ప్రదర్శనలో క్షత్రియుడి వెనక నువ్వుండాలి గానీ నీ వెనక క్షత్రియుడు కాదు.

బర్బరీకుడు - కృష్ణా దీన్ని నువ్వు అంగీకరిస్తున్నావా

శ్రీ కృష్ణుడు - సంపూర్ణంగా అంగీకరిస్తున్నాను

బర్బరీకుడు - నిన్ను తెలుసుకోలేక పోతున్నానయ్యా

శ్రీకృష్ణుడు - నువ్వు స్వతంత్రుడిగా పుట్టావు కానీ నువ్వు యిక్కడికి పాలేరుగా వొచ్చావు. యెవడి రాజ్యం కోసమో బలికావడానికి వొచ్చావు. నువ్వు కోరుకున్నదే నీకు యిచ్చాను. నువ్వు రావలసింది బానిసగా కాదు యిదే అంతరార్థం.

ఈ సంభాషణలో 'భారతదేశం' చారిత్రకంగా, సామాజికంగా, రాజకీయంగా ఇమిడిపోయింది. సుమారు 5వేల సంవత్సరాల చరిత్ర, దాని వెనక మోసం, మైనారిటీ వర్ణాల ఆధిపత్యం, నిచ్చెన మెట్ల

---

నరేష్‌నున్నా, విశాఖపట్టణం, ఆంధ్రప్రభ డైలీలో ఎడిటోరియల్ బోర్డులో పనిచేస్తున్నారు.

సమాజపు rigidity, మెజారిటీ బలహీన వర్గాల బలిపశుత్వం, ఆ వర్గాల ప్రతినిధులకు అక్కడక్కడా అరకొరగా లభించిన మర్యాదల వెనుక మర్మం, వారి విముక్తి మార్గం.... అన్నీ పై సంభాషణలోనే లోగొంతుకలతో దాగి ఉన్నాయి.

పీడితులు, దళితులు ఉంటే తప్ప తమ ఉదారత్వ ప్రదర్శనకు వీలుండదని భావించే కొందరు అభ్యుదయ కులీనులకు రారాజుని ఒక ప్రతీకచేసి ఎద్దేవ చేస్తాడు కృష్ణుడు. ఆ సోకాల్డ్ ఉదారుల పట్ల కృతజ్ఞులై ఉండనక్కరలేదని, అథమ కులస్థుడైన అంగరాజు వసుసేనుడికి కర్తవ్య బోధ చేస్తాడిలా : రారాజు నీకు హితుడేకాని స్నేహితుడు కాదు. నీకు జరిగిన అవమానం వైదొలిగి వుంటే అది యిప్పుడు నీకు జ్ఞాపకం వుండేది కాదు. నువ్వు కులోన్నతుడవై వుండీ నీ కులహీనత పోకపోగా లేని బానిసత్వం వొంటికి చుట్టబెట్టుకున్నావు. యిప్పుడు నీ బానిసత్వం వొదిలి నువ్వు అంచలను అందుకోవడానికి రెండే మార్గాలున్నాయి. వొకటి రారాజును చంపి నువ్వే చక్రవర్తివి కావడం. అప్పుడు నువ్వు సర్వ స్వతంత్రుడివి అవుతావు.

చివరికి తన అవసానవైరాగ్య దశలో అడవిలో విశ్రమించిన కృష్ణుడి పాదాన్ని పక్షి అనుకొని బాణం వేస్తాడు ఒక బోయవాడు. నేనని తెలిసి బాణం వేశావా తెలియక వేశావా అని అడిగాడు కృష్ణుడు. తెలియకవేశాను స్వామీ అన్నాడు అతడు. తెలిసివేసేదెప్పుడు నువ్వు అని శ్రీ కృష్ణుడు కన్ను మూశాడు.

ఈ ఒక్క వాక్యంలోనే ఆదివాసీ, మూలవాసీ, దళిత మహాజనులకు కర్తవ్య బోధ చేసిన శ్రీకృష్ణుడి పాత్ర చిత్రణ. అదే బడుగు ప్రజల శ్రమ దోపిడిని legitamise చేసేలా కర్మ సిద్ధాంతాన్ని గీతాకారుడై ప్రబోధించిన అగ్రవర్ణ శ్రీ కృష్ణపాత్రపరికల్పనకన్నా ఎన్నో రెట్లు విశిష్టమైనది, నిష్పాక్షికమైన దీనూ.

ఆధిపత్య విలువల్ని నేలమట్టం చేయడం 'అపూర్వ పురాణ కథలు' ద్వారా సౌదా సాధించిన 'అపూర్వ' విజయం. గతంలో త్రిపురనేని, నార్లతో సహా రచయితలందరూ ప్రతిష్ఠించబడిన 'ఉదాత్త' విలువలను ప్రతినాయకులకు ఆపాదించడమే గొప్ప ప్రతిదాడి అనుకున్నారు. త్యాగం, ధాతృత్వం, సత్యసంధత... ఇత్యాది విలువల సర్వజనామోదం, సర్వకాలీనతల వెనుక ఉన్న కుట్రను విజయవంతంగా భగ్నం చేయగలిగాడు సౌదా. సహవాసం చేత కలిగే సహవాస బానిసత్వం, పరాన్నము నాశ్రయించడం వల్ల పొందే పరాన్న బానిసత్వం, యిచ్చిన మాటకు కట్టుబడి వుండటం వల్ల తెచ్చుకునే వాగ్దత్త బానిసత్వం యీ మూడింటి వల్ల పైకొనే స్వీయ బానిసత్వం - ఇవన్నీ పుట్టు బానిసత్వం కంటే హీనమైనవి. పుట్టు బానిస యెప్పుడూ హీనుడు కాదు. అంటువొదలని బానిసగుణమే హేయమైనది అంటాడు హిరణ్యధ్వనుడు. కర్ణుడి ( వసుసేనుడి) కి కృష్ణుడు 'కర్తవ్య బోధ' చేసినా, అతను అధర్మ పద్ధతిలో బాణం దెబ్బకు గురై చావాలని కోరుకోవడంతో, బానిసలు అధికారాన్నీ అందుకోలేరు. ప్రియురాలినీ పొందలేరు. ప్రాణాలనీ నిలుపుకోలేరు. అధికారము - ప్రియురాలు - ప్రాణాలూ మూడూ పోయే వరం కోరిన వీడు సంపూర్ణ బానిస. పరమాత్ముడి కరుణా కటాక్షాలను పొందే స్వేచ్ఛ కూడా లేని కరుడు గట్టిన బానిస. ఇంద్రుడి మెరమెచ్చుల కోసం సహజ కవచకుండలాలే వొలిచి యిచ్చిన ఆత్మగౌరవం లేని బానిస అనుకుంటాడు కృష్ణుడు. ఏ సుగుణాల వల్ల దానవీరశూరుడిగా కర్ణుడు కీర్తి నందుకున్నాడో, ఆ ఘనమైన గుణాలే బానిసత్వ చిహ్నాలని అనడం మెయిన్ స్ట్రీం విలువల్ని చావుదెబ్బ కొట్టడమే.

ఆశ్రిత పక్షపాతం మచ్చుకైనా లేకపోవడం, తరతమ భేదాలెరుగని కర్తవ్య పరాయణత్వం, ధర్మనిబద్ధత ... వంటి 'ఉదాత్త' విలువలకు, లేదా 'ఘనమై'న మాటలకు కొందరు పూర్తిస్థాయి బానిసలు.

తాము సామాన్యుల కన్నా అధికులమని, ఉన్నతులమని రహస్యంగా గర్వపడుతూ, ఆదర్శాలు చేసే బ్లాక్‌మెయిలింగ్‌కు ఐచ్ఛిక వశ్యులైన ఇటువంటి అల్పులకు ప్రతీక - లక్ష్మణుడు. సీతను కారడవులలో వదిలి, అలా వదలవలసి వచ్చినందుకు దుఃఖిస్తుంటాడతను.

......ధర్మంగా వర్తిల్లడానికీ అధర్మంగా వర్తించడానికీ నీకేదో స్వాతంత్ర్యం వున్నట్లు ఆత్మవంచన చేసుకోవడం మాను. నిర్జీవమైన ధర్మగంటలోని నాలుక వలె లోహజిహ్వుడివై మాట్లాడు. కట్టుకున్న ఇల్లాలికి నువ్వు చేసిన నిర్వాకం కడుపులో పెట్టుకొని - ఆడదానిపై జాలిగానే ఆర్ద్రత గల హృదయమున్నట్లు నటించడం మాను. లోకులందరివలె కాకివి కా. కనికరం కనిపించనీక కార్పణ్యం వినిపించనీక ధర్మాగ్రహం ధ్వనించనీక - మానవాంశ లేని వ్యాకరణం వలె నొక వర్తమానం వలె ధూర్తుడయిన దూత వలె..... రామాజ్ఞ ఏమిటో చెప్పుమన్న సీత ద్వారా, లక్ష్మణుడి తరహా 'విలువల' బానిసలందరినీ ఈసడిస్తాడు సౌదా.

ఏకలవ్యుడు బొటనవేలు కోల్పోవడం వెనక అర్జునుడి స్వార్థ కారణమైతే, ఏకలవ్యుడి దళితత్వం ఒక యాధృచ్ఛికతే. ఏకలవ్యుడి వర్ణ, వర్గాలకు అతీతమైనదిగానే అర్జునుడి అసూయను గుర్తించవచ్చు. అటువంటప్పుడు ఏకలవ్యుడి తెగిన బొటనవేలు దళిత ఆత్మగౌరవ ప్రకటనకు ప్రతీక ఎలా అవుతుంది? ఎలా అవుతుందో సకథనంగా నిరూపించాడు సౌదా. అగ్రవర్ణాల మూసల్లో ఒదిగిన 'శాస్త్రం', 'జ్ఞానం' వెనుక ఆ వర్ణాల ఉనికి, స్వప్రయోజనాలు కలగలసి ఉంటాయని / ఉన్నాయని, ముఖ్యంగా బ్రాహ్మణుడు తన ఉనికికి చేటు తెచ్చే సందర్భంలో అతిక్రూరుడవుతాడని 'మహోధ్వనుడు' కథలో 105 మంది నాగరీకుల (కురుపాండవుల) గురువు (ద్రోణాచార్యుడు), గార్గికి జ్ఞాన ప్రకటన చేయబోతున్న చండాలిక తల నరికిన యజ్ఞవల్క్యుడు నిరూపిస్తారు.

పై వర్గాల ప్రాపకం సంపాదించి, తన జాతిని మరిచిపోయిన నియోరిచ్, లేదా నియో బ్రాహ్మణ వర్గానికి ఒక ప్రతీక మణికర్ణుడు (భిక్షుతాడిత). తన జాతి కుక్కలను చూసి, జాత్యానురాగం పుట్టుకొస్తుంది మణికర్ణుడికి.

లోహపు బిళ్ళ విలువకన్నా దాని మీద ముద్రకే విలువ. ఆ రాజముద్ర పెద్దదయితే లోహపు బిళ్ళ విలువ యెన్నో రెట్లు పెరుగుతుంది. ఆ రాజముద్ర చిన్నదయితే లోహపు బిళ్ళ విలువ యెన్నో రెట్లు పడిపోతుంది. ఆ లోహపు బిళ్ళ నిజ విలువని పోగొట్టుకొని తనవి కాని విలువలని మోస్తూ వుంటుంది చిన్నవో పెద్దవో. అట్లే రాజులు మనుషులకు కూడా ముద్రలు వేస్తారు. ఆ ముద్రల విలువలే నిజ విలువలుగా ఆ మనుషులు చలామణి అవుతూ వుంటారు. చివరికి తామూ స్వయంగా నమ్మే స్థితికి వొస్తారు. తన పైన పెద్ద ముద్ర పడినప్పుడు అహంకరించింది, అధికారం చెలాయించింది, అంతా తనదే అనుకుంది. తన పైన హీన ముద్ర పడినప్పుడు కుంగిపోయింది, జీవించడానికే భయపడి పోయింది, యేదీ తనది కాదనుకుంది. నిజానికి యీ రెండు స్థితులూ తనవి కావు. కష్టార్జితంతో కాకుండా పరులు ప్రసాదించిన అదృష్ట దురదృష్టాలపై ఆధారపడ జూసే వారి స్థితి యిట్లాగే వుంటుంది అని మణికర్ణుడు పడిన పశ్చాత్తాప వేదన ప్రతీకాత్మకమే.

## పెరిగే యౌవ్వనం - యిరావతి అంటాడు:

బొటనవేలు కోల్పోయిన ఏకలవ్యుడు (మహోధ్వనుడు) తన బాధానివారణకు పచ్చి మూలికను కాలుస్తాడు. వేల సంవత్సరాల నాగరీకుల క్రౌర్య చరిత్రనంతా నాలుగు వాక్యాల్లో కుదించి చెప్తే బాహుశా ఇలా ఉండొచ్చు : అరణిలో లేచిన నీలిమంటలో హరిత మూలికను భస్మం చేస్తుండగా దానిపై జీవిస్తున్న కోటానుకోట్ల సూక్ష్మ పరాన్న జీవులు - ప్రళయాగ్నిలో సృష్టి నశిస్తున్నట్లు - ప్రాణాలు

నిలుపుకోడానికి వెయ్యి దిక్కులకు పరుగులెత్తాయి. ప్రళయాన్ని ఆపమని మూగగా ఘోరంగా మొరలిడుతున్నాయి. వునికికోసం ప్రాణం కోసం సాటి జీవులను విగత జీవులను చేస్తూ వాటి కళేబరాల మీదుగా మహాప్రయాణం చేస్తున్నాయి.

చండాలిక కాటికాపరియై ఎగదోస్తున్న చితిమంటలు గుహాంతర్గత మానవుడు వుద్భవించడానికి ముందు నుంచీ వున్నవి. దైవాంశసంభూతులను సృజించాలని బ్రాహ్మణుడు హోమాగ్నిని వ్రేల్చడానికి ముందు నుంచి వున్నవి. జనకుడి కూతురిని శీలపరీక్ష చేసిన రాముడు కల్పించిన అగ్నిగుండానికి ముందు నుంచీ వున్నవి. యే అనంతర యుగాలలో యే కృత అకృత్యాలకు సాక్షీభూతంగా నిలవడానికో అవి మానవజీవుల పరిసమాప్తం అనంతరం కూడా వుండగలవు అంటాడు.

భాష, భావాలే కాకుండా, ఈ కథలకు సంబంధించిన మరో చర్చనీయాంశం source. ఈ కథల మూలం. నిజానికి (నాకు తెలిసినంత వరకూ) ఆంధ్రదేశంలో ఏ గుప్పెడు మంది వాఙ్మయకారులు ఈ పుస్తకం గురించి చేసిన చర్చ ఏదయినా ఉందంటే అది కచ్చితంగా ఈ sourceకి సంబంధించిందే కావడం గమనార్హం. Contentని, form ని అప్రధానం చేసి, source మీద అంత శ్రద్ధ చూపించడంలోనే తెలుగు సాహిత్యజీవుల originality దాగుంది. 'ఇంతకీ ఎక్కడ నుంచి సాధించాడీ సమాచారం?,' 'విశేష అధ్యయనం ఎక్కడేడ్చింది, అంతా స్వకపోలకల్పితమేనేమో ....', 'ఇలా దాచి ఉంచడం plagiarismని దాచుకునే గడుసు ప్రయత్నమా?'..... ఇటువంటి సందేహాలు కోకొల్లలు. Reading the epics between the lines ఫలితమే ఈ రచనేమో అని అనుకోబుద్ధి కాదు. సౌదా అనుయాయుల్లోనే, సారూప్య భావకుల్లోనే ఈ శంకలు ఎక్కువ ఉండటానికి కారణం బహుశా పరిచయమైతే మనుషులు చవక అవడం వల్లనేమో. 'మన మధ్య, మనతో పాటు, మనలానే చొక్కా, ఫ్యాంటు వేస్కొని, తమ కన్నా ఆబగా అన్నం తినే మనిషి' లో ఇంతటి సృజన, సామర్థ్యం, నైపుణ్యం ఉన్నాయంటే నమ్మ బుద్ధి కానితనం.

సరే! వాళ్ల ఏడు పెలా ఉన్నా, sourceకి సంబంధించినంత వరకూ నాకు తోచిన విషయాలు ప్రస్తావించే ముందు మన ప్రిజుడీస్‌కి సంబంధించిన ఒక ఉదాహరణ:

రాముడు మన దైవం, ఆయన జాతిరక్తంలో కలిసి, కరిగి ఉన్నాడు. (తను ఏ అల్ప సంఖ్యాక వర్గ / వర్ణ ప్రయోజనాలు పరిరక్షించేందుకు జీవితాంతంపాటుపడినా) రాముడు అందరికీ దైవమే. ఈ భావమే భవభూతి (ఉత్తర రామచరిత) చేత శ్రీరామ పరివేదన ఘట్టానికి మూలమయింది. 'జనవాక్యా' నికి జడిసి, గర్భవతి సీతమ్మను కారడవులకు పంపించవలసి వచ్చినప్పుడు, నిద్రలో ఉన్న సీత పాదాల దగ్గర రాముడు దుఃఖించినట్టుగా రాశాడు భవభూతి. ఈ పరికల్పనకి భారతీయాత్మ నొచ్చుకోలేదు. పైగా రాముడికి మరింత ఉదాత్తత ఆపాదించబడినందుకు సంతోషపడింది. కానీ, ఆదమరిచి నిద్రిస్తున్న సీత చేతిలోని వన్నెల విసనకర్ర మీది నిగూఢ చిత్రాన్ని చూసి సీత గర్భాన్ని రాముడు శంకించాడని సౌదా రాస్తే మాత్రం sourceకి సంబంధించిన ప్రశ్న తలెత్తుతుంది. మనం ఎంత అభ్యుదయ కాముకులమయ్యామని అనుకున్నా, బ్రాహ్మణీయం మనల్ని శాసించి, నడిపించే సహజాత లక్షణం. ఎంత రాముడి పక్షాన వహించి, ఆయనను ఆదర్శాల ఊతకర్రలతో నిటారుగా నిలపాలని ఎందరు రచయితలు శ్రమించినా, వశిష్ఠ, విశ్వామిత్రాదుల వంటి బాహ్య శక్తుల చేతిలోనే కాదు; అసూయ, అనుమానం, పరప్రత్యయ బుద్ధి, కీర్తికండూతి వంటి అంతః శక్తులకు వశ్యమైన రాముడి వెన్నెముక లేనితనం రామాయణంలో కనబడుతూనే ఉంటుంది. లోచూపుతో చదవిన కారణంగానే పాత్రల మనోవల్మీకాలను సౌదా తెరిచి చూడగలిగాడనిపిస్తుంది.

అసలు ఈ 'మూల'మనే పదమే చాలా సాపేక్షం. ఉదాహరణకి మహాభారతాన్ని తీసుకుంటే, వ్యాసభారతం మూలమనుకుంటే, ఉత్తర, దక్షిణ ప్రాంతాలలో అది లిఖింపబడినప్పటి తీసుకున్న తీరులో భిన్నత్వముంది. భండార్కార్ ఇన్స్టిట్యూట్ వారు 50 ఏళ్లు నిర్విరామ కృషితో పరిష్కరించి, పరిష్కార ప్రతిని ప్రచురించక ముందు, ఉత్తర ప్రాంతపు మూల ప్రతులలో నేపాళ్య, గంగాదేశపు ప్రతులు, వాయవ్యంలో శారద, దేవనాగరి ప్రతులు, గంగాదేశపు ప్రతులలో మిశ్ర నేపాళీ, మైథిలి, బెంగాలీ.... వంటి భిన్న ప్రతులు ఉన్నాయి. దక్షిణ ప్రాంతంలో పూర్వ ద్రవిడ, మలయాళీ ప్రతులు, మళ్లీ ఈ పూర్వ ద్రవిడలో తెలుగు గ్రంథ ప్రతులు ఉన్నాయి. 50 సంవత్సరాల కృషిలో వెయ్యికి పైగా విభిన్న మహాభారత కథనాలను సరిచూసి, భారతదేశంలోనే గాక, బైట పైనా, టిబెట్టు, బర్మాలలో మహాభారత రాత ప్రతుల్ని సంపాదించారు. వీటిలో అసలు ఏదయి ఉంటుంది. ప్రక్షిప్తాలు ఎక్కువగా ఏ వెర్షన్‌లో చేరాయి..... వంటి ప్రశ్నలకు ఎంతో శ్రద్ధగా, బాధ్యతగా ఎందరో పండితులు పరిశోధన చేసి నిగ్గు దేల్చారు (అయినా వారి పరిమితుల్ని మర్చి పోకూడదు). అసలు vulgate ఏదో ఇప్పటికీ తేల్చి చెప్పగలమా? వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడో, ఉగ్రశ్రవుడు లోమహర్షణుడు నైమిశారణ్యంలో శౌనకుడికి చెప్పాడో తెలీదు. వ్యాసుడు తన ఐదుగురు శిష్యులకు మహాభారత కథ వినిపించాడని మరో కథ ఉంది. అదే పాండవుల జయగాథ. అది 'జయ' మనే కావ్యమయి ఉంటుందని తర్కం. ఐదుగురు శిష్యులు తమ ఇష్టాను సారం, తమ కళానైపుణ్యానుసారం కథను విస్తరించారంటారు. ఇప్పుడు మన సౌలభ్యం కోసం సౌదా ఆ ఐదుగురు శిష్యులలో ఒకడని అనుకుంటే నష్టమేమీ లేదు. లేదా, చెట్టు చాటు నుంచి ఆరవ శిష్యుడై విని. మన enlightenment కోసం పుస్తకరూపంలో తెచ్చాడని అనుకోవచ్చు. అప్పుడు sourceకి సంబంధించిన తర్జనభర్జన మరిక ఉండదు.

వాస్తవానికి మూలానికి సంబంధించి ఇన్ని శిగపట్లు పట్టి, శిరోభారాన్ని తెచ్చుకోకూడదనే 'కొసరు' చివర్న చేర్చాడేమో సౌదా అన్పిస్తుంది. జనశ్రుతిలో ప్రచారంలో ఉన్న కథల్ని ఏర్చికూర్చి 'కొసరు'గా సౌదా అందించడంలోనే, 'తాంబూలాలిచ్చాను తన్నుకు చావండ'నే తరహా చమత్కారం, గడుసుదనం ఉందనిపిస్తోంది నాకు.

ఇవేమీ కాకుండా, స్వకపోలకల్పితంగానే, 'faction' అనిపించేలా రాసినట్లయితే, సౌదా అసాధారణ ప్రజ్ఞకు, ఆ విశ్వామిత్ర ప్రతిసృష్టికి ఆంధ్రదేశం పాదాభివందనం చేయక తప్పదు.

★ ★ ★ ★

మళ్లీ మొదటికొస్తే, (ఈ పెను ప్రళయం పొంచి ఉండక మునుపు ఉన్న) నిరపాయ, నిర్భయ, నిశ్చితస్థితి ఇక బద్దలయ్యే సూచనలు కనిపించడమే నా గుర్పాటుకు కారణం. పెరియార్లు, ఐరావతి అలాగే, మాతంగుడి (చండాలుడి) కొడుకైనా, వజ్రవేలశ్రేష్ఠి మనవడుగా, ఘనాపాఠీల మధ్య వేదాభ్యాసంతో పెరిగిన మాండవ్యుడు కూడా బ్రాహ్మణ సహవాసాన్ని పరమ పవిత్రంగా యెంచి బ్రాహ్మణుడిగా ప్రవర్తిల్లడానికి తహతహలాడతాడు. ఇటువంటి తన్నితరిమి వేయబడిన బానిసలెప్పుడూ ఆ పాత స్థానాన్ని స్వయంగా విడిచి వొచ్చామని ఆత్మవంచన చేసుకుంటారు. ఆ స్థానం యెంతటి నరకప్రాయమో చెప్పటానికి మాయమాటలను యెంపిక చేసుకుంటార'ని చీదరించుకుంటాడు సౌదా.

భూమికి - భూపాలుడికి, నరులకు - నృపాలులకు ఉన్న సంబంధంలో ఆధ్యాత్మికాంశను జొప్పించి, రాజును విష్ణువుతో సమానుడిగా చేసిన మోసాన్ని బైట పెట్టడాన్ని కూడా ఈ సందర్భంగా

సౌదా మరిచి పోలేదు. రామరాజ్యాలు, స్వర్ణయుగాలు, రారాజుల వైభవాలు, మహారాజ ప్రాభవాల వెనక చీకటి నీడల్ని, కుట్రల్ని, కుతంత్రాలను ప్రతిభావంతంగా బట్టబయిలు చేశాడతను.

మీరే కన్న తండ్రి వలె కాపాడుతున్నారని మీరే అన్నపూర్ణ వలె పోషిస్తున్నారని అయోధ్య పౌరులు ప్రగాఢంగా నమ్ముతున్నారు ప్రభూ అంటాడు దుర్ముఖామాత్యుడు శ్రీ రాముడితో ఏకాంత సంభాషణ చేస్తూ -

- సత్యం చెప్పావు అన్నాడు శ్రీరాముడు.

- యింకొక సత్యం కూడా వుంది ప్రభూ, ప్రజలు సైనికులై నిరంతరం మిమ్మల్ని కాపాడుతున్నారు. ప్రజలు హాలికులై సతతం మిమ్మల్ని పోషిస్తున్నారు. యీ విషయం రహస్యం ప్రభూ అన్నాడు దుర్ముఖుడు.

దీర్ఘాలోచనలో పడ్డాడు శ్రీరాముడు.

- ఈ రహస్యాన్ని రహస్యంగా ఉంచి ప్రభువే పోషిస్తున్నాడని ప్రభువే రక్షిస్తున్నాడని ప్రచారం చేయడమే దిలీప చక్రవర్తి నుంచి నేటి వరకు సాగుతున్నది. అయోధ్య వాసులందరికీ ముప్పూటలా మూడు రోజులు తిండి పెడితే మన అంతఃపురం ఆవిరై పోతుంది ప్రభూ. అంతేగాక నాలుగో రోజు నుంచి ప్రభువు పోషించలేడనే సంగతి పసిబిడ్డకు కూడా తెలిసిపోతుంది ప్రభూ. తమని పోషించేది ప్రభువు కాదనే రహస్యమూ, తామే ప్రభువును పోషిస్తున్నామనే సత్యమూ బయటపడిపోతాయి ప్రభూ అని చెప్పాడు దుర్ముఖుడు.

ఈ రహస్యం ఇంకా రహస్యంగానే పోషించబడుతూ, రామరాజ్య స్థాపనలు, రామాలయ నిర్మాణాలు ఆధునిక దుర్ముఖుల లక్ష్యం కావడం వెనక అసలు సత్యాన్ని గ్రహించాలన్నదే సౌదా పిలుపు. మెయిన్ స్ట్రీం విలువల సంకుచితత్వాన్ని బట్టబయిలు చేయడమే గాక, ప్రత్యామ్నాయ విలువల ప్రతిష్ఠాపనలో మాతంగుడిని యావత్ భారత దళిత ప్రతినిధిని చేసి, భరత జాతి పతనానికి కారణాన్ని, విముక్తి మార్గాన్ని అన్యాపదేశంగా ప్రకటించాడిలా :

మాతంగ యెంగిలి తిన్నవాళ్ళే మాతంగను అర్ధాకలితో వుండగా చంపించినారు. మాతంగ ఆకలి తీరిన రోజు యీ కరువు కాటకాలు సమసిపోతాయని అంటాడు.

యజ్ఞవల్క్యుడి అగ్రపూజార్హతను ప్రశ్నించి, అంతర్గత మత్సరాలను కూడా మరిచి ఒక్కటైన పురుష విప్రోత్తముల నిరసనను ఎదుర్కొన్న గార్గి; తన పదునాలుగేళ్ల నిద్ర(?)లో, సీత 14 ఏళ్ల వనవాసంలోనూ ఉన్న పాతివ్రత్య భేదాన్ని, అంతఃపుర రహస్యాల్ని సీతకు విప్పిచెప్పిన ఊర్మిళ; కుశలవుల అంతర్మథన కాండాన్ని చదవి, తల్లడిల్లి ఆత్మహత్య చేసుకోవడం ద్వారా తన ఆత్మను గౌరవించుకున్న సీత; చండాలిక హత్యతో ఆచూకీ లేకుండా పోయిన మైత్రేయి; యజ్ఞవల్క్యుడి రెండవ భార్య, నిరక్షరాస్య అయిన కాత్యాయినీ; మంథర, భృగుపత్ని, తారక (తాటకి), సూర్పనిక......... ఇత్యాది సజీవ స్త్రీ పాత్రల ద్వారా, మూలవాసీ, ఆదివాసీ, దళిత మహాజనుల్లో స్త్రీలు ఎంత కీలక భాగస్వాములో వివరిస్తాడు సౌదా.

ఇదంతా భావానికి సంబంధించినదైతే, ఈ కథలలో మరో విలక్షణమైన అంశం భాష, వ్యవహారిక భాషా ప్రామాణికంగా స్పెల్లింగ్ ఉండాలన్న పాత ఆలోచనకి (చలంగారు ఉదాహరణ) కొనసాగింపుగా 'యాగ్నవల్క్యుడు', 'గ్నానం', 'రామాగ్న,' 'ప్రతిగ్న', 'స్వర్నసీత', 'గ్నాపకాలు', 'స్తితి' 'కటోరమయిన', 'దుక్కం', 'నిర్విగ్నం,', 'కృతగ్నుడు (కృతజ్ఞుడా? కృతఘ్నుడా?)' ...... వంటి

పదాలు పుస్తకమంతా వాడాడు సౌదా. అయితే, అది సహజంగా కాకుండా, ప్రయత్నపూర్వకంగా చేయడం వల్ల కృతకంగా, వృథా ప్రయాసగానూ అన్పిస్తుంది ( క్షాళ్లుడు, మధ్యాహ్నం, అదృష్టం, దుర దృష్టం, బిళ్ళ ( బిల్ల కాదా ) వంటి మినహాయింపుకు లోనయిన పదాలు కొన్ని). అయితే, అనన్య సామాన్యమైన రచనా శిల్పంతో ఆ లోపాన్ని ఏ మాత్రం కనబడనీకుండా చేశాడు రచయిత. రచయితగా సౌదా మాగ్నమ్ ఓపస్‌గా ఈ కథా సంకలనాన్ని పేర్కొనవచ్చు. 'కొసరు' కాకుండ 125 పేజీలున్న ఈ పుస్తకంలో నూటపాతిక మహాగ్రంథాలకు సరిపడా సమాచారాన్ని కూర్చడానికి సౌదా శైలీగతమైన నైపుణ్యమే కారణం. పూర్వాశ్రమంలోనేగాక, హృదయంలో కూడా కవి కావడం వల్ల కవితానిర్మాణ రహస్యాలన్నింటినీ ఈ subaltern ఆధునిక, లేక ఆధునికోత్తర ఇతిహాసంలో వాడాడు. అక్షరాలు పైకి ఒక అర్థాన్నిస్తూ, ధ్వనిగా మరొక అర్థాన్ని సూచించడం auditory imagination అయితే, పలు అర్థాల్ని సాధికారికంగా సూచించడం, చదివిన ప్రతిసారీ ఏదో కొత్త అర్థాన్ని సూచించడం, చదివిన ప్రతిసారీ ఏదో కొత్త అర్థాన్ని స్ఫురింపచేయడం ఈ కథలలో విశేషం. మాతంగి, భిక్షుతాడిత కథలు ముఖ్యంగా metonomic కవితలయ్యాయి.

జీవనది రాత్రి పూట నిద్రపోదు. యిప్పుడు కూడా అది మోకాటిలోతునే ప్రవహిస్తోంది. పగటికొక సత్యమూ రాత్రికొక సత్యమూ వుండదని మా అమ్మ చెప్పింది. గురూ, సత్యాన్వేషకులు యముడితోనూ మన్మథుడితోనూ తప్ప యెవ్వరితోనూ యేకాంత సంభాషణ చేయరాదని మా అమ్మ చెప్పింది అన్న సత్యకాముడి మాటల్లో గౌతముడికే కాదు, పాఠకులకూ స్ఫురిస్తాయి ఎన్నో అర్థాలు.

దుర్ముఖుడు ( భిక్షుతాడిత, తిత్తిరి, తారక), తిత్తిరి పాత్ర చిత్రణలో సౌదా నిగూఢత నిర్వహించిన తీరు అద్భుతం. ఏది జన వాక్యమో, ఏది జనవాక్యంగా శాసించబడి, ప్రతిష్ఠించబడి, ప్రచారానికి నోచుకుందో, ఆ జనవాక్య పర్యవసానాలు... అన్నీ దుర్ముఖుడి రాజకీయంలో, తిత్తిరి పాత్ర రూపకల్పనలోని కుయుక్తిలో, శుకాలి బలిలో తేటతెల్లమవుతూనే, మరో సత్యం నిగూఢంగా దాక్కుంటాయి. రాముడు, తర్వాత కుశీలవులు సీత పాతివ్రత్యాన్ని ఛాయామాత్రంగా అనుమానించడాన్ని అక్కడక్కడా ( వాలి, తిత్తిరి, సీత) ప్రస్తావనకు తెచ్చిన తీరు సౌదా మార్మిక శిల్ప నిర్వహణాచాతుర్యానికి తిరుగులేని సాక్ష్యం.

ఇక సందర్భోచితంగా సౌదా చేసిన వర్ణనల తీరు ఇది :

పరీక్షిత్తు భార్య, ఉత్తర కుమారుడి తనయ యిరావతి అందాన్ని వర్ణిస్తూ, లేయెండ ఘనీభవించి పిల్ల తెమ్మెర ద్రవీభవించి సంగమించిన యాదృచ్ఛిక - యిరావతి. పూలతానికి ముత్తిల్లి ముడి జారిపోయే కురుల బరువుకు తలవాలినప్పుడు వేణీ గరిమను నాభికి తూల్చే చన్నులు యీమెవి. వయసుతో పాటు కార్వేలు, బాబూరావ్ భాగల్‌లు, నామ్‌దేవ్ ఢస్సాళ్లు..... ఒక్కటై చేసే 'కీడు' కన్నా, సౌదా ఒక్కడే ఆంధ్రదేశానికి చేసే 'కీడు' ఎక్కువని గ్రహించి, నిర్జీవంగా, నిస్సత్తువుగా, నిస్సహాయంగా కూలబడిపోయిన తెలుగు దళిత సాహితీ చైతన్యం - 'అపూర్వ పురాణ కథలు' మార్గదర్శకత్వంలో నూతన జవజీవాలతో పైకి లేస్తుందన్న భయం నాకు ఏ కోశానా లేదు. కానీ, అక్షరాలు కూరిన ఈ డైనమైట్లు ఇలా గ్రంథాలయాల మాధ్యమంతో ఆంధ్రదేశం నలుమూలలకు సరఫరా కావడం మాత్రం భయకారణమవుతోంది. తెలుగు దళిత సామాజిక చైతన్య మహాప్రళయానికి ( విరామ చిహ్నాల అడ్డంకులు కూడా లేని) ఈ గ్రంథం కారణమవుతుందేమోనని, భద్రమైన మా సామాజిక స్థానాలు ఎక్కడ తారుమారవుతాయోనని..... భయం..... ఒణుకు..... వెన్నులోంచి -

(సమాప్తం)